# నిరుద్యోగి

కథ :- డి. వి. రాఘవస్వామి.

632





వ. 06

రచయిత :- వి. వి. శాస్త్రి.

శ్రీ నాగేశ్వరీ నిలయం, గుంటూరు.

# నిరుద్యోగి


కథ :- దరిశి వీర రాఘవస్వామి.

రచయిత :- వంగవోలు వేంకటేశ్వర శాస్త్రి.



ప్రచురణ :- నాగేశ్వరీ బుక్ షాప్,
గుంటూరు.



సర్వాధికారములు రచయితవె.





మొదటి కూర్పు 1000 ప్రతులు.

శ్రీ జయనామ సం॥ చైత్ర శు ౧ లు.

1954



కాపీ రైట్]


[వెల 1-0-0

# విధేయత

చదువర మహాశయులారా!

అచ్చొత్తించు వేళ ప్రమాద వశమున బడిన
తప్పులను దిద్ది ఒప్పులుగా చదువు
కొన వలయునని ప్రార్థన.

ఇట్లు :- రచయిత

# మనవి

ఇందు సందర్భాను కూలముగా కొందరు గౌరవనీయ
వ్యక్తులను, అధికార పదవులను పలుకరించ
వలసి వారి పేర్లను పొందు పరిచి
యుంటిని గాన శ్రీవార లన్యథా
భావించక నన్ననుగ్రహింప
గలందులకు మరి మరి
విధేయతతో
ప్రార్థిస్తున్నాను.

ఇట్లు,
రచయిత.



# పాత్రలు.

| | |
|---|---|
| మురళీధర్ :- | కథానాయకుడు. |
| హరిబాబు :- | మురళీధర్ అన్న. |
| జనార్ధనరావు :- | మురళీధర్ తండ్రి. |
| నారాయణరావు :- | మురళీధర్కి దత్తు తండ్రి. |
| వెంకటప్పయ్య :- | మినిష్టర్. |
| సుందరం :- | వెంకటప్పయ్య మేనల్లుడు. |
| సత్తార్ :- | దొంగ వ్యాపారస్తుడు. |
| రత్తం :- | నారాయణరావు గుమాస్తా. |
| ముంతాలు :- | వెంకటప్పయ్య యింటి పనివాడు. |
| రామయ్య :- | లేబరిముఠా నాయకుడు. |
| కోటంరాజు<br>శేషాచలం<br>రంగనాథం | రామయ్య అనుచరులు. |
| పోష్టు జమాను :- | |

—స్త్రీలు—

| | |
|---|---|
| మంజు :- | మురళీధర్ భార్య. |
| లలిత :- | సుందరం భార్య. |
| సరళ :- | హరిబాబు భార్య. |

# నిరుద్యోగి

## ( ఒకటో రంగం )

[ నారాయణరావుగారింటిముందు వరండాలో నాలు గైదుకుర్చీలు వేసివుంటాయి; ఓసోఫాలో నారాయణ రావు చుట్టకాలుస్తూపండుకొనివుంటాడు; తెరలేస్తుంది ]

నారాయణరావు :— అరేయ్; రత్తం!

రత్తం :— చిత్తం. [అంటూవచ్చి ప్రక్కగా నిలుచుంటాడు.]

నారా :— పరీక్షాఫలితాలు చూడాలన్నానుకదా; పత్రిక నేమైనా పట్టుకొచ్చేవా?

రత్తం :— చిత్తం. అది మనకేనాడూ అలవాటులేదుగదండీ?

నారా :— ఆరివెధవా! అందుకని—కొనుక్కొరాకుండా నే కొంపమునచేరుకొన్నావన్నమాట? అంతేనా రత్తం!

రత్తం :— చిత్తం.

నారా :— సుఖంలేదురా నీతోటి—సుద్ద దండుగగాయిస్తున్నానురా; నేనుకాబట్టి—నీకీ నెలజీతాలు. ఏమంటావ్? రత్తం!

రత్తం :— చిత్తం. ఏమయినా యెందుకంటానుబాబూ! మీరు చెప్పినమాట కాదంటే మీకుకోపంవస్తుందని చేరగానే చెప్పారుకదండీ? చిత్తమంటాను—చేతులు జోడిస్తాను.

నారా :- ఛా! నోరుమూసుకో___

రత్తం :- చిత్తం.

హరిబాబు :- ఫష్ట్‌క్లాసుఛాన్స్___ఫష్ట్‌క్లాసుఛాన్స్- [అంటూ గబగబావచ్చి కుర్చీలో కూర్చుంటాడు.]

నారా :- హరిబాబూ! ఏమిట్రా, నీ హడావడి? "ఫష్ట్‌క్లాసు ఛాన్స్" అంటూ పరుగెత్తుకొచ్చేవు?

హరి :- ఇంకా యేమిటంటూ వేంబాబాయ్! ఇంటర్‌మీడియట్ ఫష్ట్‌క్లాసులో ప్యాసయ్యేడు బాబాయ్! ప్యాసయ్యేడు.

నారా :- ఎవరురా, పేసయింది?___మనవాడేనా?

హరి :- మరి, మవవాడుకాకపోతే___మనకెందుకీ సరదా?

నారా :- ఏమిటేమిటీ? మురళీధర్ ఎఫ్,ఎ- ప్యాసయ్యాడూ?

హరి :- అయ్యాడు యేంటిబాబాయ్! అయ్యాడు___అయిన కర్చేదో అయింది. బి,ఎ- కూడా చదివించు బాబాయ్! యం. మురళీధర్- బి,ఎ- అయిపోతాడు.

నారా :- ఆ___బి; ఎ. చదివించడం నాలాంటి బిక్షాధికారి పనిరా హరిబాబూ!

హరి :- నీవు బిక్షాధికారివా? అరె___బలేమాటన్నావు బాబాయ్! నీవుబిక్షాధికారివైతే మనూరిలో లక్షాధికారంటూ మరెవరున్నారు?

నారా :- (ఎదుటచూచి) అడుగోమనవాడు___అనుకొంటుండగానే వచ్చాడు.

హరి :- ఏం, తమ్ముడూ! పరిటీకొట్టకుండా ప్యాసవుతూ, యేకగ్రీవంగా ఎఫ్; ఎ-దాకా గొప్పఛాన్సు కొట్టేశేవే?

మురళీధర్ :- అంతా మీదయేగదా, అన్నయ్యా! (అంటూ వచ్చి కుర్చీలోకూర్చుంటాడు)

నారా :- ఏరా మురళీ! కూడూ నీళ్ళయినా లేకుండా తిరుగుతున్నావు. కొద్ది గుమాస్తాపనయినా కుదిరిందా?

మురః :- ఇంతవరకేమీ యేర్పాటుకాలేదు నాన్నా!

హరి :- నౌకరీ దొరకటమంటూ యీరోజుల్లో నమ్మకంలేదు బాబాయ్!

రత్నం :- చిత్తం--ఎఫ్, ఎ-లు... బి, ఎ-లు ప్యాసయినవారంతా యెన్నాళ్లనుండో "వుద్యోగం--వుద్యోగం" అంటూ వూళ్లుపట్టుక తిరుగుతున్నారు బాబూ! ఒక్కళ్లకయినా నౌకరీ చిక్కినట్లులేదు.

ముర :- అవును నాన్నా! ఈరోజుల్లో యెక్కడచూసినా నిరుద్యోగసమస్య నిండిపోయింది. ఏ ఆఫీసుకుపోయినా, యెవరి నాశ్రయించినా "నో వేకెన్సీ" అంటూ నోరు విప్పేవారేకాని ___ మచ్చుకయినా మరోమాట చెప్పేవారు లేరు నాన్నా!

నారా :- అయితే___అంతే నంటావటరా!

హరి :- అంతే యేంటి బాబాయ్! అంతే___

నారా :- ఒరేయ్, మురళీ! ఓమాటమరచాను. మొన్న యెలక్షనులో నన్ను సహాయం కోరాడే ___ ముత్యాల

రావు. అతనికి కనపడి రవ్వంత ఆలోచించలేకపోయేవా?

మురః— అదేమిటి నాన్నగారూ! అలాగాఅడుగుతారు? నేనంత నిదురపోతూ మందమతిగా మసలుకుంటున్నాననా? వేసిన వాయిదాలన్నిటికీ వెళుతూనేవున్నాను—కనపడమన్నచోటునెల్లా కనబడుతూనే వున్నాను. ఫలితం శూన్యం—ప్రయాస ఘనం.

హరిః— అసలు నీవెవరవయిందీ అతనికి జ్ఞప్తి అంటూవున్నదా?

మురః— జ్ఞప్తి లేదు—విజ్ఞప్తి లేదు. నేనుగుమ్మంతొక్కంగానే "నీవెవరవూ"? అంటూ విలువబెట్టి నిర్మొగమోటంగా మాటాడేడు. నాన్నగారి పేరుచెప్పేననుకోండి "నారాయణరావుగారా" అంటూ నాలుగు నిముషాలపాటు పక్కమొగంపెట్టి పైకిచూచేడు.

నారాః— (కోపంతో) ఆడి, రాస్కెల్! అప్పుడే మరిచిపోయాడూ? ఓటింగురోజుల్లో వొంగొంగి దణ్ణాలెట్టి—పని పూర్తయిందాకా పాదాలుపట్టి—మెంబరయేక మిటకరించి చూస్తాడూ?

హరిః— చూస్తాడూ యేంటిబాబాయ్! చూస్తాడు. ఈ యం, యల్, ఎ—మెంబర్సు...యీ పంచాయితీబోర్డుప్రెసిడెంట్సు సంగతంటూ నీకు సొంతంగా తెలీదుకాని—నాకు తెలీనిదంటూ నాలుగుసముద్రాలమధ్యా లేదుబాబాయ్!

మురః— అసలుసంగతాలోచిస్తే, వీళ్లకు వోటివ్వటం మన తప్పుకాని, వీళ్లతప్పేముంది? ఓటంటేఏమిటో—ఓటువిలు

వంటేమేమిటో; యిచ్చేవాళ్ళకూ తెలీదు—పుచ్చుకునేవా ళ్ళకూ తెలీదు. పదవీస్వీకారానికి కావలసిన ప్రధాన లక్షణ మేమిటి? అనురాగముతో కూడుకొనిన ఆదరణా? అభి మానంతో నిండిన అహంభావమా? ఓటివ్వటమంటే తమ యింటిలోనున్న పీటలాగా, చేటలాగా భావించారే కాని—నెత్తిమీద బెట్టుకొనబోయే నిప్పులకుంపటియని, అలుసంతైనా ఆలోచించేరా?

రత్తం :- చిత్తం. చిత్తం.

నారా :- చిత్తమేమిటయ్యా! నీమొఖం. చీటికి మాటికి చేతు లునులుముకుంటూ సిద్ధమౌతావు—చిత్తమంటానికి—

రత్తం:- చిత్తం. అదికాదండీ! ఓటుకోసం ప్రాబలాటపడేవారి బండారం నాకు బాగాతెలుసు. మొదట పదవికోసం— పిదప పైసాకోసం.

హరి :- వందలూ వేలూ పెట్టి వోట్లుసంపాదించినవారంతా మందిమీాద దయచేతనా? లక్షలుకొల్లగొట్టి లాంఛనంపొం దటం సంబరాలుపడి సంచులు నింపుకొంటానికే. ఎలక్ష నులో నిలుచుండటమంటే యేమిటనుకుంటున్నావ్? మా ర్కెట్ బిజినెస్ బాబాయ్! మార్కెట్ బిజినెస్.

మురః :- అన్నయ్య చెప్పిందంతా అక్షరాలా నిజంనాన్నా! ఆఁ—అంటే అరగంటలో ఆరరుపడిపోతుంది. నంజటానికి మనం కాస్త నైవేద్యం చెల్లిస్తే మాంచి యుద్యోగం మాపో రేపో వస్తుంది.

నారా :- ఎదురుపెట్టి చదరంగ మాడాలన్నమాట?

ముర :- అవునునాన్నా! కావాలననుకొని కష్టపడేవాడికిది కాలమూకాదు—గౌరవమూకాదు.

నారా :- కాలమూవొద్దు — కర్మమూవొద్దు. లభించేలాగుంటే లంచంపెట్టడానికేం? నాలుగురోజులనాటి కేమయినా నౌకరీ యిస్తారేమొ బాగా విచారించి బయానాయిచ్చిరా!

ముర :- (ఆశ్చర్యముగ) ఏమిటినాన్నా! నల్లబజారులో నౌకరి కొనుక్కోవచ్చుకొనటమా? తమరుకూడా యీనీచతనానికి తలొంచుతారా?

నారా:- అవునోయ్! "ఉద్యోగం పురుషలక్షణం" అన్నారు అప్పటివాళ్లు. "లంచం ఉద్యోగలక్షణం" అన్నారు యిప్పటివాళ్లు. కాలాన్నిగమనించి కళ్లుమూసుక పోవలసిందేకాని న్యాయం, న్యాయం అంటూంటే నాలుగుచెంగులూ ముడేసుకునే గతే మిగులుతుంది.

రత్తం :- చిత్తం. మీరు చెప్పినమాట మినిష్టరు లేపాటిస్తున్నారండీ!

నారా :- అబ్బాయ్!

ముర :- నాన్నా!

నారా:- ఆ రత్తానికున్న ఆలోచనయినా నీకు లేదురా! చెప్పిచెప్పకముందే చప్పున తెలుసుకున్నాడు.

రత్తం :- చిత్తం. చిత్తం.

నారా :- (కోపంతో) ఛీ! నీచిత్తం నాచెవులముందు వెయ్యి వద్దని వెయ్యిసారులు చెప్పేను. ఇదో రత్తం! నీకునిజంగా బుద్ధిలేదయ్యో!

రత్తం :- చిత్తం.

నారా :- ఏరామురళీ; ఏమీ మాట్లాడవేమిరా?

ముర :- లంచాలతో నౌకరీ సంపాదించటం యించుకైనా యిష్టంలేదునాన్నా!

నారా :- ఇష్టంలేదూ? ఎఫ్,ఎ- అయ్యేదాకా యెంతడబ్బో తగలెట్టానే? నలుగురితోబాటు నడతమార్చుకోకపోతే పెట్టినకర్చిలా గిట్టుతుందిరా?

ముర :- విత్తం వెచ్చించి విద్యనార్జించటం విజ్ఞానానికికాని యుద్యోగానికికాదునాన్నా!

నారా :- అబ్బాయి మురళీధర్! ఆఖరుమాటినను. నాయింట్లో వుండి నాయాస్తి ననుభవింపదలంచుకొంటావా చెప్పినట్లు చేస్తానని వొప్పుకో. కాదనదలచుకొంటావా, కాలికిబుద్ధి చెప్పుకో. ఉద్యోగం చెయ్యకపోతే వుట్టిగట్టుక వూరేగుదామనుకొన్నావా?

ముర :- క్షమించండి. నన్నిలా లంచాలవారికి బలిచేయటానికానాన్నా! నన్నింతగా చదివించేరు?—పేదవారి పొట్టలమీద కొట్టటానికానాన్నా! పెద్ద పెద్ద యుద్యో

గాలు చేయమంటారు?— దయా, దాక్షిణ్యం లేకుండా ధనందోచుకొంటానికానాన్నా! కాలేజికివెళ్ళి క్వాలిఫికేషన్ సంపాదించమన్నారు?— నాన్నా! కుడిచికూర్చుండటానికి కొద్దో గొప్పోగల మనమే లంచాల చూపించి నౌకరీలు లాభించేలాగయితే జీతంవస్తే నేగాని జీవనంజరుగని భాగ్య హీనులెలా బ్రతకాలి? నిరుద్యోగసమస్యతో నిత్యదారిద్ర మనుభవిస్తున్న ఆంధ్రసోదరులెందరో "అలోలక్షణా" అంటూ అల్లాడిపోతున్నారే? ఆణిముత్యాలతో— అప రంజిరాసులతో—ఐశ్వర్యాలనూ, ఆనందాల ననుభవిం చిన మనాంధ్రగడ్డమీద నేడొకవంక క్షామదేవత నృత్య మాడుతూంటే—వేరొకవంక స్వార్ధవ్యాధి వికటనాట్యం చేస్తూంటే—మరోవంక లంచాలపిశాచం మారుమసలు తూంటె—చదువూ, సంస్కారంగల మనం చేచాచి యాచించవలసిందీ గతిలేనివారి నోటిదగ్గరి గంజినీళ్ళ కేనా? తొందరపడి ముందుకుపోవలసిందీ దోపిడిదొరల దోవ నేనా? ఇందాకటనుంచీ మనమిక్కడ లంచాలమరిగి లక్ష్యమెరుగని అధికారులగూర్చి ఆడిపోసుకున్నామే?— లోకం మనలనైనా అలాగే లోకువచేయదానాన్నా?

నారా :- ఆరిదరిద్రుడా; అంతెవరకూ వచ్చావ్? నీకింత కాలమూ చదువుచెప్పించింది నీచేత నీతులుచెప్పించుకొం టానికా? సంపాదించి చేతికిస్తే సంతోషించుదామనా?

ముర :- నాన్నగారూ! మన్నిస్తానంటే మనవిచేసుకుంటాను.

నారా :- ఉద్యోగంలేకుండా పూరేగుతాననటమేగా? మనవి

చేస్తానంటూ నీవు మాటాడబోయేది?

ముర :- కాదండీ నాన్నగారూ!

నారా :- ఆ—అలాదారికొచ్చి అదేమిటో చెప్పు.

ముర :- లంచంలేకుండా నౌకరీ లభించిందంటే తమమాట లాగా తల దాలుస్తాను. కాని—

నారా :- ఆ— కానీ— నేనుమాత్రం లంచం పెట్టను, పట్టను- అంటావ్?

ముర :- అంతేనాన్నా! ధర్మమె దైవం—దయె చుట్టం.

నారా :- చాలులేవోయ్! నీయుపన్యాసం. అన్నకొడుకువని ఆదరించేను — దగ్గరకుతీసుకొని దత్తుచేసుకొన్నాను— వందలూ వేలు నీచదువుకోసం వల్లకాడు చేసేను. ఇప్పుడు —యిన్నాళ్లకు ధనం సంపాదించాలిరా, నాయనా! అంటే ధర్మాలు చెప్పొచ్చేవు. పరాయివాడవుకాబట్టి నన్నిలా పరాభవించేవుకాని కన్నకొడుకు వయితే నామాట కాదంటావా?

హరి :- బాబాయ్! తమ్ముడు నీమాటంటూ తప్పుతాడా? తెలిసీ తెలియనిదానికింత తెగ దెంపులెందుకు?

నారా :- హరిబాబూ! అయిందేదో అయింది. నీతమ్ముణ్ణి తిరిగి నీయింటికే తీసుకెళ్లు. ఈరోజునుంచీ దత్తూలేదు— గిత్తూలేదు.

రత్తం :- చిత్తం. కావాలనుకొని చేసుకొన్న దత్తు కాదనుకుంటే పోదు బాబూ!

హరి :- తొందరబడి త్రోసివెయ్యకు బాబాయీ!

ముర :- నాన్నా!

నారా :- (లేచి కోపంతో) నాన్న — ఎవడురానీకునాన్న? వెళ్లు—ముందు బయటికివెళ్ళిమాట్లాడు. ఊఁ—నిముషం కూడా నాయింట్లో నిలువనక్కర్లా.

ముర :- (మెల్లగ రెండడుగులువైచి, వెనుకకు తిరిగిచూచి, దీనముగా) ఆలోచన లేకుండా ఆగ్రహపడుతున్నారు నాన్నా!

నారా :- అనవసరంగా ఆలశ్యంచేయొద్దు.

ముర :- సరె నాన్నా! (నడుచుచుండును)

హరి :- బాబాయ్! బాగా ఆలోచించుకో.

నారా :- మురలీధర్! మురలీధర్!

ముర :- (వెనుకకు తిరిగిచూచి) ఎందుకు పిలిచారు?

నారా :- ఇలారా! (కుర్చీలో మరలాకూర్చొనును)

ముర :- (ఆశతో గబగబావచ్చి) ఏమిటి నాన్నా!

నారా :- ఏమీలేదు—

రత్తం :- చిత్తం. పొమ్మంటే పోతున్నారుగదా? ఏమీలేక పోతే యెందుకు పిలిచినట్లుబాబూ!

నారా :- పెంపువచ్చేటప్పటికి నీవు పదేళ్ల వాడివి. నీకిప్పుడు పాతికేళ్ళు నిండొస్తున్నాయి. ఈపదునైదేండ్లు యెవడి తాతగాడి సొమ్ము దిన్నట్లు?

రత్తం :- చిత్తం. చిత్తం. ఎవరితాతగారి సొమ్మందింతే యెవరూరుకుంటారు బాబూ! వారి తాతగారిసొమ్మే. పెంపుదీసుకొన్నావు కాబట్టి పెంపుడుతండ్రివి నీసొమ్మ దిన్నాడు.

నారా :- ఇదోరత్తం! ఈరోజుమొదలు నీవు మా యింటి విషయాల్లో పనిగల్పించుకోవద్దని పట్టుదలగా చెప్తు తున్నాను.

రత్తం :- చిత్తం.

హరి :- అయిన కర్చునుగూర్చిమీా యభిప్రాయ మేమి టంటారు?

నారా :- చిల్లికాసిలతో గూడా చెల్లించి మరీ వెళ్ళ మంటాను.

ముర :- నాన్నా! మీారు దత్తుచేసుకొన్నందున కన్నతండ్రి యాస్తిలో కానీరాదు. దత్తువదలుకొన్నా నన్నందున మీావద్ద దమ్మిడీరాదు. పైకమెక్కడిది కనుక మీావద్దు చెల్లించను?

హరి :- కావాలంతే కాగితం రాయించుకో బాబాయ్! కాగితం రాయించుకో.

నారా :- రత్తం. మురళీధర్ పేరుతో అయిదువేల రూపా యలకొక ప్రాంశరీనోటు, రాసి యివ్వవయ్యా!

రత్తం :- చిత్తం. ఇంటి విషయాల్లో పని గల్పించుకోవద్దని యిపుడేకదండీ చెప్పేరు?

నారా :- (చిరాకుతో) చెప్పినట్లు చేయవయ్యా!

రత్తం :- చిత్తం. మురళీధర్ మీకుబాకా? మురళీధర్‌కు మీరుబాకా? చిత్తగించి సెలవిప్పించండి.

నారా :- (కోపంతో) అబ్బబ్బా! అడివిమనిషివయ్యా! వాడికినేను బాకేమిటి వయినంలేకుండా వాగుతావు?

రత్తం :- చిత్తంబాబూ! అయిదువేలరూపాయలు తమరిచ్చి, అయినదత్తు రద్దుచేసుకుంటున్నారేమో ననుకున్నాలెండి.

నారా :- వీడిచినట్లేఉంది?

రత్తం :- చిత్తం. ఇదంతా అలాగానే వున్నదండి. కాలగంట గడువిప్పించండి. కాగితం రాసిస్తాను. (తెర)

బ్యాక్‌గ్రౌండు :- [సాంగ్]

ఇంతేనా? జగమంతా—యింతేనా?

చెప్పేదంతా ఘన నీతేనా?
చేసేదంతా అవి నీతేనా?

చదివినదంతా స్వార్థము కొరకేనా?
పదవి మరింతా పాపము కొరకేనా?

ఎంతైనా మది చింతేనా?
సంతోషం బిసు మంతేనా?

బాసలెంతో మూయ బొంతేనా?
వేసమంతా కళ్ల గంతేనా?

# నిరుద్యోగి

## ( రెండో రంగం )

[ జనార్ధనరావుగారి యిల్లు. జనార్ధనరావు కోపంతో అటూ, యిటూ పచార్లు చేస్తుంటాడు. హరిబాబు, మురళీధరులు నిలుచుండి వుంటారు. తెరలేస్తుంది. ]

జనార్ధనరావు :— (కోపంతో) చేసినకార్యమింకా సిగ్గులేక చెప్పొచ్చేరు. నోటురాసి యిచ్చొచ్చేరట—నోటు.

హరి :— తమ్ముడన్నమాటలో తప్పేముందినాన్నా! లంచా లిచ్చే లాలూచీపద్ధతి మనలాంటివారికి మర్యాదకాద న్నాడేనను కో—బాబాయి పరుసమాత్రం బాగుందేంటి?

జనా :— లంచగొండి తనాన్ని విమర్శించడాని కాయనొక లాయరయేడు — అది సమర్థించడానికి నీవొక అడ్వొకేటు వయేవు.

హరి :— కాదునాన్నా! నీ తమ్ముడి సొమ్ముకోసమై నాతమ్ముడ్ని తాకట్టు బెడతావా? మురళీధరుడికక్కడే వుంటే హరిబాబు పొందబోయే యాస్తిలో పంపిణీ బెట్ట వలసి వస్తుందనేనా పెంపకమివ్వటం? బాబాయి భాగం రాకపోతే బ్రతుకలేకపోతామా? అభిమానానికి పాటుపడే స్వేచ్ఛజీవి అభిమతం తెలుసుకోకుండా ఆయనలా నోరుపారేసుకున్నాడే—

జనా :- ఇంతగా చెప్పొచ్చేవు—యేమన్నాడేం?

హరి:- ఏమయినా అంటాడు. ఎదిరించి మాటాడేవాడుం టేగా? ధనంమూట వస్తుందని మీరు దాసోహమంటు న్నారు—అదిచూచుకొని ఆయన అదిరిపడుతున్నాడు— మురళీధరుడంటే పురుగునకుమల్లె విదిలించాడు — "ఇన్నాళ్లూ యెవడితాతగాడిసొమ్ము తిన్నట్టు" లన్నాడు- నిముషంకూడా నాయింట్లో నిలువనక్కర్లేదన్నాడు— "పరాయివాడవు కాబట్టి నన్నిలా పరాభవించావుకాని, కన్నకొడుకయితే కాదంటాడా" అనికూడా అన్నాడు. ఏం? వాడేమంత వ్యక్తతలేనివాడని? తగని పనులుచేసి వాడు తెచ్చిన తలవంపులేమిటి? గౌరవించినకొందీ గంతులు వైచాడు — బ్రతిమిలాడినకొంది కాళ్లు చాచాడు — అభమూ, శుభమూ యెరుగని ఆపసి సన్నాసిని......

జనా :- (అడ్డువచ్చి) ఏం? అంటే యేంపోయింది? ఉన్న హోదాలు వూడిపోయాయా? ఒళ్లునిండా చిల్లులు పడ్డాయా? చెప్పినట్లుచేసి, చేజిక్కినదానిని దక్కించుకో లేని దద్దమ్మలు—మహా తెలిసినవాళ్లను మల్లే మాటా డొచ్చేరు. పదిమందితోపాటు పాటు బడకపోతే ప్రపం చంలో బ్రతకాలా? లేదా?

ముర :- లంచాలమాటెత్తే తలకంటే తుంచుక పోయే తలే తెలుగు జాతి కొక దివ్య జ్యోతి గద నాన్నా!

జనా :- అదుగదే—ఆజబ్బే పనికిరాదంటున్నాను. సంస్కృత పండితునకు మళ్లీ సమాసాలు దంచేస్తున్నావు. దత్తు తండ్రిని దబాయించింది చాలక కన్నతండ్రి మీద కయ్యాని కొచ్చేవా?

ముర :- నాన్నా!

హరి :- మురళీ! నేనున్నాను—నీవు మాటాడకు. కన్నకొడుకు కన్న కరుణకూడా లేకుండా నిష్కారణంగా మీరే నిందిస్తున్నారు. వాడు కయ్యా మాడనూలేదు — కళ్లెఱ్ఱ చేయనూలేదు. మీరే కారాలు నూరుతున్నారు— కత్తి దూస్తున్నారు.

ముర :- అన్నయ్యా!

హరి :- ఆగుతమ్ముడూ! నాన్నా! పెంపకమంటూ జరగటం యిక పెద్దల నాటి మాట.

జనా :- నా తమ్ముని భాగం నా తనయులకు చెందటం?

హరి :- మరో మార్గముంటే మహారాజులా చెందొచ్చు.

జనా :- మురళీధర్ దత్తు మాట మరచి పోవలసిందేనా? నారాయణరావంటే నా తమ్ముడే నని తెలుసా?

హరి :- తెలుసు — మీ తమ్ముడి మీద మీకుండే ప్రేమ నా తమ్ముడుమీద నాకూ వుందని మీకు తెలుసా?

జనా:- పనికి మాలిన రోషాలు పెట్టుకొని పకీరుని చేయటమేనా ప్రేమ? ప్రేమంటే యిదికాదురా పెద్దమ్మ

పుత్రుడా! పిల్లులేని పినతండ్రి యిల్లు నిలుపు—యింటి సొత్తు యింటిలోనె కలుపు. అన్నదమ్ములందరూ హాయిగా వుండాలనే మా యందరి కోరికానూ—

ముర :- అలా తమరంటే అన్నగారుమాత్రం చీదరించుకొని చిరాకు బడతారా? నాన్నగారూ! భగవానుడిచ్చిన భాగ్యభోగ్యములున్నాయ్! — మీదయవల్ల మేమింత వాళ్లమయేం—కూర్చుండి తిన్నా కొరతలేదు. అయినా అంతపనేముంది? న్యాయంగా పాటుబడి నాలుగురాళ్లు సంపాదించడంలో నాయభ్యంతరం నలుసంతయూ లేదు.

నారా :- (గబగబావచ్చి) అభ్యంతరం లేకపోతే అవశ్యం ఆచరించు. అందివచ్చిన అవకాశాన్ని చేతులారా చెడగొట్టుకోవద్దు. (అంటూ మురళీధర్ చేతికొక కాగితమందించును)

ముర :- (కాగితము విప్పి చదువుకొని నిట్టూర్పు విడుచును.)

హరి :- ఏమిటది? —ఎక్కడనుంచి వచ్చింది.

ముర :- కరుణా రైసు మిల్లులో కాళీయున్నదట—స్టార్టింగ్ జీతం నూటేబది రూపాయలట—చేరదలచుకొంటే రేపే చేరాలట.

జనా :- అయితే యింకేం? అవశ్యం చేరొచ్చు.

నారా :- ఇందాక నేనా మాటన్నాననే యింతవరకూ తెచ్చేరన్నయ్యా! చెప్పినమాట వినలేదని చిరాకుపడ్డాను. "బాబాయి మనసెంత బాధపడుతుందోనని" అనుకొం

టానికి "పరాయివాడవు కాబట్టి నా పరువు తీశేవుకాని, కన్న కొడుకు వయితే నామాట కాదంటావా" అనికూడా అన్నాను. అప్పటికైనా ఆలోచించేరా?

హరి :- కన్న కొడుకు కాకపోయినా అన్నకొడుకే గదా? పరాయి వాడిలాగా పలచనచేస్తే, "ఆ లేత హృదయం అల్లాడి పోతుందో, లేదో? నని" అలుసంతైనా ఆలోచించేరా? అన్నీ తెలిసిన మీరే ఆగ్రహ పడితే, దరీ పరీ తెలియని మురళీధర్ మాత్రం......

జనా :- (అడ్డువచ్చి) హరీ! పెద్దవాళ్లతో యీ పెడవాద మేమిటి?

ముర :- అన్నయ్యా! ఆసమయం అలాంటిది. జరిగిపోయిన దానికింకా యీ జాతరెందుకు?

హరి :- కావాలని యెవరిక్కడ కాచుక కూరుచున్నారురా తమ్ముడూ!

జనా :- ఒరేయ్, నారాయణా! ఓ మాట చెప్తాను. మన పిల్లల మాటకు మనమే కోప్పడితే—యితరత్రా వాళ్ల మాట లెలావుంటాయిరా?

నారా :- పసిసన్నాసుల మాటకు నేనుమాత్రం పగబూను తానా అన్నయ్యా! "కలిసి వచ్చినదాన్ని కాలదన్నుకొంటాడేమో ననే"గా కాగితం చూడంగానే కాళ్లు కాళ్లూ కొట్టుకొంటూ వచ్చాను. హరిబాబూ! రేపు మురళీధర్ [illegible]లుకు నీవూ పోయి పనిలో చేరేదాకా [illegible]......

హరి :— దానికేం? బాబాయ్! దానికేం—దర్జాగా వెళ్లొస్తాను. ఏరా, మురళీ! ఏమంటావ్?

ముర :— ఆ రైసు మిల్లులో అడుగడుగునా బ్లాక్‌మార్కెట్ బాహాటంగా పిలిస్తే పలుకుతోం దన్నయ్యా!

నారా :— బ్లాక్‌మార్కె టుంటేనేరా బాగుపడేది—

జనా :— కంట్రోలు ధరలకు కట్టుబడితే కాళీచేతులు, కళ్ల నీళ్లేరా మిగిలేది.

ముర :— దొంగ పద్దులు రాసి దోపిడి చేయలేను నాన్నా!

నారా :— వారంరోజులు జరిగితే వాళ్లే నేర్పుకుంటారు.

జనా :— నేర్పుకొనకపోతే నెలజీతా లిచ్చేవాళ్లు యెదురుగా కూర్చొన బెట్టుకొని యేం చేసుకొంటారు?

రత్తం :— చిత్తం. (అంటూవచ్చి) లాటరీ ప్రైజు లాంటి లక్కీ ఛాన్సగదా? పట్టేసారో? నెట్టేశారో?

నారా :— రత్తం! నిన్నికక్కడకు రమ్మని చెప్పనిదే నీ వెందుకొచ్చావ్?

రత్తం :— చిత్తం. చిత్తం—తమరు రమ్మన్నారని నేనురాలేదు కాని — రావద్దని చెప్పలేదు కాబట్టె రావలసొచ్చింది బాబూ!

హరి :— తమ్ముడూ! వుద్యోగమునుగూర్చి నీ యుద్దేశ్యమేమిటి?

ముర :- కోట్లకొలది ప్రజలు కూడులేక ఘోషిస్తున్నారు.
పుట్లను పుట్ల ధాన్యం పుచ్చిపోతున్నా సరే "గిరాకీ
వస్తుంది లెమ్మంటూ" గిద్దెడు గింజలనైనా పుట్టనివ్వ
కుండా బొట్టలలో నింపుకొన్నారు. అలాంటి రైతు
లను అదేమిటంటూ అనేకమంది అడుగలేక పోతు
న్నారు — మధ్య తరగతివారు మాడిపోతున్నారు —
కూలి ప్రజలు గోల పెడుతున్నారు — ఆకలి బాధతో
అలమటించేవారి ఆర్తానాదాలు ఆకాశమంటు
తున్నాయి—పస్తులుచేసి యెందరో ప్రాణాలు యిడుస్తు
న్నారు. ఇంత చదువుకొని—యీ పరిస్థితిలో, పదిమందికి
పనికల్పించి పరామర్శించవలసిన మనం కరుణా రైసు
మిల్లులో కాలుబెట్టి—తప్పుడు లెక్కలను తయారుచేసి—
లంచాలబేరమంటే మంచినీళ్ల ప్రాయమని—ఉన్నవారికే
పూడ్చిపెట్టి — సామాన్య జనానీకానికి సహాకరించలేక
పోగా నోటిదగ్గరి నూకలు తీయలేనన్నయ్యా!

జనా :- అందుకని ఆడముండలా యిక యీదట యింట్లో
కూర్చుంటావా?

ముర :- ఇంట్లో కూర్చుంటాననే భయం మీ కెందుకు కల
గాలి? నాన్నగారూ! మగసిరిగల పూర్వం మనకు లేక
పోతేగా? మీరందరూ "సరె" నంటే మేలైన పద్ధతుంది.
అవసరమైనంత డబ్బు మన కందుబాటులో వుందికదా?
బియ్యపు ఫ్యాక్టరీ నొకటి మనమే బిగిన్ చేద్దాం—కష్ట
జీవులనింత కనికరిద్దాం — బీదా బిక్కి కిన్ని బియ్యపు

నూకలు సరసమయిన ధరకు సరఫరా చేద్దాం. మనకు స్వాతంత్ర జీవనం—మనమంటే లేబరికి మమకారం కొద్ది రోజుల్లోనే కోలుకొనవచ్చు.

హరి :- తమ్ముడు చెప్పినట్లు తప్పక చేద్దాం నాన్నా!

జనా :- ఓరి దౌర్భాగ్యుల్లారా! ఉన్నదాని నయినా వుండ నీయక పోగొట్టు కొనడానికి మీకీ బుద్ధిపుట్టిందా యేరా? స్వంత వ్యాపారమిపుడు స్వప్నంలోకూడా అనుకోవద్దు. కన్నతండ్రి, దత్తుతండ్రి కావాలనుకుంటే కాదనకుండా కరుణా రైసుమిల్లులో చేరంట, కాదనుకొంటే కాలికి బుద్ధి చెప్పుకొనటమేకాని, మళ్ళీ మాటాడటమంటూ మాయింటిలో పనికిరాదు.

ముర :- అలాగా అయితే అవశ్యం వెళ్తా నాన్నా! (వెళ్ళబోవును.)

హరి :- తమ్ముడూ! ఎక్కడికయ్యా! తలవని తలంపుగా యీ ప్రయాణం?

ముర :- ఎక్కడికి వెళ్లుతానో, యేమో నన్నయ్యా! నాకు తెలియును కనుకనా నీకు చెప్పటం?

హరి :- మురళీధర్ మనసు సరిపడేదాకా వుద్యోగంలేకుండా వూరికే వుండమని చెప్పండి నాన్నా!

జనా :- అరనిముషంకూడా అక్కర్లేదు. కూడివచ్చేదానిని [illegible]సుకుంటే మంచి రోజులంటూ మనజన్మలో [illegible]

నారా :- పొయ్యో వాడిని పోనివ్వరాదురా హరిబాబూ! బుఱ్ఱ తిరిగితేగాని బుద్ధి తిరుగదు. తలవ్రాలు నొకరు తప్పించ గలరటరా?

హరి :- తలవ్రాలు తప్పించట మొకరి తరంకానిమాట నిజమె. నాన్నా! బదులు మాటలేకుండా భాగమిపుడు నాకు పంచిపెట్టు.

జనా :- ఎందుకు? ఏమవసరం?

హరి :- కావాలి___కావలసినంతుంది.

జనా :- అంటే?

హరి :- అంటే___ముందు బాబాయి నోటుపైకం ముట్ట చెప్పటానికి___నాకు వచ్చినదానిలో నాతమ్ముడికి పంచి పెట్టడానికి.

జనా :- వాడికిక్కడ భాగం వడ్లగింజంతయినా లేదు.

హరి :- నీ భాగంలో యివ్వమని నేనుచెప్పలేదు. నాది నాకి మ్మన్నాను___నాసగంలో నా తమ్ముడికి నే నిచ్చుకొంటా నన్నాను.

నారా :- తండ్రివద్ద పంచుకొన్న దానిమీద తమ్ము డధి కారం లేదు.

హరి :- అదినాయిష్టం. అడ్డుపెట్టడాని కెవరికీ అధికారం లేదు.

మురి :- అదేమిటన్నయ్యా! అలా తొందరెందుకు? నీకు నామీద నిజమయిన ప్రేమవుంటే నాన్నావాళ్ల నేమీ

అనవద్దని వేయిసార్లు వేడుకుంటున్నాను.

హరి :- (ఆశ్చర్యపడి) అదేమిటి తమ్ముడూ! అలా అంటావ్?

ముర :- నిజమేనన్నయ్యా! నేనో పనిమీద వెళ్లుతున్నాను.

హరి :- ఎక్కడకు?—ఏమిటాపని?

ముర :- ఆ వివరములన్నియూ ఆతరువాత చెప్తాను. జాగా నిర్ణయం కాగానే జాబు వ్రాస్తాను. నాన్నావాళ్ల మనసు మారేక నాకు తెలియచేయటానికి నీవిక్కడనే వుండాలి.

హరి :- నీవు చెప్పిన మాట నెరవేరేలావుంటే లక్షణంగా వెళ్లి లాభంపొందిరా తమ్ముడూ! నీ మాటంటూ నేను కాదంటానా?

ముర :- వెళ్తాను. (పోవును.)

రత్తం :- చిత్తం. నారాయణరావు బాబుగారూ! అమలాపురంనుండి అర్జంట్ టెలిగ్రాం వచ్చిందండీ!

నారా :- అర్జెంటు టెలిగ్రామా? అయితే చెప్పలేదేం?

రత్తం :- మీరేదయినా మాటాడేటప్పుడు మరోమాట మాటాడ కూడదని చెప్పేరు కదండీ?

నారా :- ఏడిచినట్లేవుంది—యిప్పటికైనా తగలెయ్యి.

రత్తం :- చిత్తం. మీది మీకియ్యకపోతే మాకెందుకు? (యిచ్చును.)

నారా:- (చదివిఆదుర్దాతో) అన్నయ్యా! అర్జంటుగావెళ్లాలి.

జనా :- ఎందుకూ? ఏమిటీ విషయం?

నారా :- మరేమీలేదు. మా మామగారు మాట్లాడేస్థితిలో గూడా లేరట—ఈసారి బ్రతికితే యింకోజన్మ యెత్తినట్లేనట.

జనా:- అంత ప్రమాదంగావుంటే ఆలోచించకుండా వెళ్లిరా!

నారా :- వస్తానన్నయ్యా!— (తెర)

## బ్యాక్‌గ్రౌండు (సాంగ్)

ధర్మమె లేదా-జగతీ-ధర్మమె లేదా—యీ జగతీ
న్యాయమెరుగని వారిదేనా లోకమూ-యీలోకమూ

న్యాయమేనా కష్టములకు మూలమూ-
అల్పులంతా అధికులైరా - ఆదరించుట కెవరు లేరా?

ధర్మము గెలువదా - దైవము నిలువడా
దుర్మార్గులకే - కడు దోహద మానా॥

కార్మికబ్రతుకులు - కష్టాలపాలేనా
నిర్మలాత్మ లిలపై - నీటిలోని మూటేనా॥

# నిరుద్యోగి

## (మూడో రంగం)

[ సుందరం వో వైపునుంచి, మురళీధర్ రెండో వైపు నుంచి యెదురౌతారు. ]

సుందరం :— హల్లో, మిష్టర్—మురళీధర్! గుడ్ మార్నింగ్.

ముర :— యూ? మిష్టర్, సుందర్! థ్యాంక్యూ—

సుంద :— ఏరా బ్రదర్! ఎప్పుడు కనబడుతావా, యేమా అనుకొంటున్నా. అనుకోకుండా యీరోజు అగస్మాత్తుగా కనపడ్డావు. వెరీగుడ్ - వెరీగుడ్. ఆ—అన్నట్లు అడుగ మరిచేను. ఏం చేస్తున్నావు?—యేమిటీకథ?

ముర :— ఏమి చేయటానికి—ఎటు పోవటానికి పరిస్థితు లేమీ పాటుగా లేవురా!

సుంద :— వీధిలో నిలుచుండేనా, విశేషాలన్నీ? నువనయింటికి పోదాంరా! మంచీ చెడ్డా మాటాడుకోవచ్చు. (ఇద్దరూ నడచు చుండగా తెర లేచును. రెండు మూడు కుర్చీలు వేసియున్న సుందరంయిల్లు కనుపించును. యిరువురూ చేరియొక కుర్చీలో కూర్చొందురు) ఏ సబ్జెక్టులో చూచినా యేబదికిపైన మార్కు లొచ్చేయి—మురళీధర్‌తో పోటీ అంటే ముందుమొగంపెట్టే స్టూడెంటే లేడు. బి.ఎ.కూడా చదవకుండా యిలా బికారిలా తిరుగుతున్నావేమిరా?

మురః- బి,ఎ-చదివే భాగ్యం నాలాంటి బీదాడికెక్కడిదిరా?

సుంద :- నారాయణరావు బీదవాడంటే నస్మేవాడంటూ వుండడు. "కూడివచ్చేకొంది కుండలమ్ముకొన" మన్నట్లు పట్టింది బంగారమయ్యే రోజుల్లో పరమ లోభివవుతున్నా వేమిరా? ఛా! ఛా!

ముర :- నారాయణరావుగారి కంటే నాకేమొస్తుందిరా?

సుంద :- నీకు కాకపోతే నాకు వస్తుందా యేరా? నారా యణరావుగార్కి దత్తుకొడుకువని నాకు తెలుసులేవోయ్!

ముర :- ఆరోజు లలా మారిపోయి తారుమారుగా తయా రయాయి కాబట్టే ఆవూరూ ఆవూరూ అగచాట్లుబడి తిరగాలి సొచ్చిందిరా!

సుంద :- అరె బ్రదర్! అరవకుండా కూర్చోవోయ్! దేశాలు పట్టుక దేబరించే కర్మ నీ కెక్కడిదిరా?

ముర :- కాదురా సుందర్! కథ అడ్డం తిరిగింది.

సుంద :- అడ్డం తిరగటానికి అసలు సంగతేమిటీ!

ముర :- సంగతీ లేదు — సందర్భమూ లేదు. కరుణా రైసు మిల్లులో ఖాళీయున్నదన్నారు. బ్లాక్‌మార్కెటు బ్రహ్మాం డంగా పెరిగిపోతున్న ఆ రైసుమిల్లులో చేరి—రాక్ష సత్వం చూపి—దిక్కులేని దీనప్రజలకింత తిండి పెట్టలేక పోగా, తినబోయే మెతుకులు తీయలేనన్నాను. బ్లాక్ మార్కెట్ లేకుంటే బ్రతుకే లేదన్నారు — లంచం

ముట్టకపోతే లాభం లేదన్నారు — యీ పనులు నావల్ల కావని యెంతో బ్రతిమిలాడాను. కనికరించ వలసినవాళ్లు కళ్లు పూనారు — నిలుచున్నవాడిని నిలుచున్న పాటున యిలువీడి పొమ్మన్నారు.

సుంద :- ఓస్! ఈ భాగ్యానికా యింత డంగై పోతున్నావు మనిషివి—డోన్ట్ కేర్.

మురః :- "డోన్ట్ కేర్" అంటే - డొక్కనిండే దెలాగా?

సుంద :- దానికింత దడుపెందుకురా? సవాలుచేసి సరదాగా బ్రతికేదానికి.

మురః :- అదె "యెలాగూ" అని అడుగుతున్నాను.

సుంద :- నీ వడగనూ వొద్దు. నేను చెప్పనూ వొద్దు. అలా వున్న ప్లేటు నిలా మార్చివేయటమే.

మురః :- అంటె?

సుంద :- అంటె—యింటికి పోవడమె.

మురః :- ఆ—

సుంద :- "ఆ" అంటూ అదిరిపోతావేమిట్రా? మాయింట్లో కొన్నాళ్లుండి మరీ వెళ్లుదువు లేవోయ్!

మురః :- తిరిగిపోవటమనేది తేలికయిన పనికాదురా సుందరం!

సుంద :- ఏం?—ఎవరయినా యెగతాళి చేస్తారంటావా?

మురః :- చేయరని నీవు చెప్పగలవా?

సుంద :- ఎవడురా నాన్ సెన్స్ — ఎక్కడున్నాడురా వాడు?

మురళి :— ఎవడా? ఎవడయిందీ తెలియకుండానే మాటాడుతున్నావురా సుందరం! కాలేజీ లెక్చర్సులో కంఠం బద్దలు చేసుకొన్ననాడు నీలో నవచైతన్యం నాట్యమాడించిన దెవడు?—నిర్మల హృదయ వికాసం నిరుపమాన దేశోద్ధారణయని స్టేజీమీదకెక్కి చేతులెత్తిననాడు మానసోత్సాహం నీలో మారుమ్రోగించిన దెవడు? నీవా?—నీలోనున్న నీ హృదయ స్వరూపు డింకొక వ్యక్తియా? ఆ వ్యక్తి — నీ హృదయ పరివర్తన నిరూపించగలవ్యక్తి — నీ జీవిత చరిత్ర నిజముగా నీకు చూపగలవ్యక్తి — అతని నడుగు—యేమంటాడో?

సుంద :— ఏమిట్రోయ్, మురళీ! ఏమిటీ యీధోరణి? నలుగురూ వింటే నవ్విపోతారురా!

మురళి :—న్యాయం మాట్లాడితే "నవ్విపోతారం" టావేమిట్రా?

సుంద :— న్యాయం; న్యాయం— న్యాయం యెవరికి కావాలిరా యీరోజుల్లో? నాటకం కావాలికాని—

మురళి :— ఆం— నాటకమా?

సుంద :— అవునురా బాబూ! అవును. అసలీ ప్రపంచం అంటేనే అదో నాటకం—నాటకమనేదంతా బూటకం.

మురళి :— అయితే ఆనాడు నీవు చెప్పినవన్నీ అబద్ధాలేనన్న మాట ?

సుంద :— అబద్ధంకాదని అడిగేదెందుకు? సి. యస్. ఆర్. ఆంజనేయులుగా రున్నారురా! భక్త తుకారాం వేసి,

భక్తిరసం కురిపిస్తున్నారు. కైవల్యం రావాలనా? కిరాయి కావాలనా?—అలాగే, స్థానంవారున్నారనుకో—కేసు కొట్టుకొని—కోక కట్టుకొనటం నటనా చాతుర్యం చూపటానికా? నాథునితో కాపురం చేయటానికా?—తిక్క తెలుసుకొని యిప్పటికైనా తెలివి తెచ్చుకోరా బ్రదర్! స్టూడెంట్ లైఫ్ యీజ్ సోషల్ లైఫ్.—కాలేజీ యుపన్యాసాలు కలకాల ముంటాయిరా? పలహారాల కోసం—ప్రైజులకోసం — అంతకుమించిన అంతర్యాగ్రం గరల్సుచూచి గౌరవిస్తారనేకాని, సంస్కరణాభిలాషతో సభమీదికొచ్చే దెవడురా? మానవలోకమంటే మాయ దారి లోకమోయ్! అంతే, మిష్టర్! అంతే— ఇంతకంటే నీవు తెలుసుకోవలిసింది యీలోకంలో లేద్ — యీ మాటకు తిరుగు యేలోకంలో లేద్.

ముర :— నా మనసంతా నలకడబెట్టావురా సుందరం!

సుంద :—నలకడ పడితేనే కాని— నిలకడచిక్కదురా! చూడూ! బోధనా విధానమంటూ యీ టీచర్సుకు బొత్తుగా తెలీ దంటే నమ్ము. ఎక్సపీరియన్సు లేని చదు వెంతయితేనేం? చదివి చదివీ మెదడు చవటబారి పోతుందిరా! నేను చెప్పి నట్లు చేసి ముందు నిన్ను నీవు బాగుచేసుకో. నీ కిదే నిజ మైన గురూపదేశం—దేవరహస్యం కూడాను.

ముర :— ఛీ—ఛీ! ఎధవ ప్రపంచం—ఎధవ స్వార్థం. నీ వింత నిష్ప్రయోజకుడ వౌతావని యెప్పుడూ అనుకోలేదురా సుందరం!

సుంద :- అరేయ్! నా ప్రయోజనం నీకేరూపంగా పనికొస్తుందో చెప్పు. నే చేయగలదంటూ వుంటే నెరవేర్చి తీరుతాను.

ముర :- స్థిరచిత్తముంటే సిద్ధించనిదంటూ వుంటుందటరా?

సుంద :- (పరిహాసముగానవ్వి) "ఆలోచన చేయలేని అమాయకు డెవరయా" అంటే "మురళీధరుడే" నని మొదటిసారిగా చెప్పాలి. ఎఫ్,ఎ- చదివిననాలెడ్జి యిలావుంటుందనుకోలేదురా! మతికేమయినా మసక కప్పిందాయేరా? అపగ డాక్టరునై ఆప్రషనుచేస్తాను. ట్రీట్ మెంట్ బాగా యిస్తేనే కాని నీవు పాటుకు వచ్చేలా లేవు.

ముర :- అబ్బబ్బా! వినలేక అల్లాడి పోతున్నానురా! కర్ణకఠోరంగావుంది నీ వర్ణనాతీతం. అకుణాని కాఉణానికి అంతులేని భావకవివై పోతున్నా వేమోయ్! ఏం భావమురా? ఆ భావం——ముభావం.

సుంద :- చిత్తశుద్ధి వుంటే చేయలేని పనుండదన్నావుకదూ?

ముర :- అవును——అయితే?

సుంద:- పేదవారి నాదరించాలనని పెద్దవాళ్ళతో పేచీపెట్టుక వచ్చావే?——

ముర :- వస్తే?

సుంద :- ఆ రానటం స్థిరచిత్తంతోనా? పరచిత్తంతోనా?

ముర :- చెప్పుచుంటాన్?

సుంద :- అంటాను. అందుకు నీ సమాధానం?

మురః- అవునంటాను.

సుంద :- అవునంటె అవశ్యం క్రొత్తగా ఫ్యాక్టరీ నొకటి నిర్మించి కూలీలను రక్షించు చూద్దాం. చేతిలో పైసాలేని చిత్తశుద్ధి యేం చేస్తుందో—

ముర :- (మాటాడకుండా వుంటాడు.)

సుంద :- ఏరా? నా కవిత్వంలోని ముఖ్యాంశం నీ కార్యసాధన లోనికి వో మాటుగా వూడి పడిందేరా?

ముర :- సుందరం! స్వతంత్రజీవనంగల సంపన్నుడవునీవు. అనుకొన్న పని చేయదగ్గ అవకాశం నీకుంది. కర్మాగార మొకటి కట్టించరా! ప్రాలుమాలకుండా పనిచేస్తాను.

సుంద :- చాలులేవోయ్! నీ చాతుర్యం— పూర్వు లిచ్చిన దానిని పోగొట్టుకోకుండావుంటే కోట్లు సంపాదించి కూడ బెట్టినంతపుణ్యం. కూలిగుంపు బ్రతక లేదని యెఃరికొంపలు కూల్చుకొంటారురా?

మురః- (కోపంతో) సుందరా! ఆనాడు కాలేజిలో నీవుచెప్పిన ఆ యుపన్యాసాలు విని? అసలైన దేశభక్తితో నాచరిస్తా వని—అన్యాయాలకు గురియై అలమటించేవారి నాదరిస్తా మని, నీవద్దకువచ్చి నిన్ను యాచించాను. కాని-కొండంత నాయాశను కొల్లగొట్టే గొడ్డుబోతు వనుకోలేదు—స్వతం త్రించగల సమర్థుడవనుకొన్నానుకాని భగణపు మెతుకులు దిని బ్రతికే పందలాగా ప్రవర్తిస్తావని......

సుంద :- (కోపంతో) షటప్- (చెంపమీద కొట్టును.)

మురః :- సుందర్! చెప్పితే తెలుకోలేనినాకు చెంపదెబ్బతో తెలియ చెప్పావు. మంచిది. వెళ్లొస్తాను. ( తెర. )

[నేపథ్య -- పద్యం]

గీ॥ భీతి బడకుండ-ధైర్యంబు వీడిపోక
మచ్చ బడకున్న నీ చిన్ని మానసాన
చెక్కు- చెదరని నిజకీర్తి జీవకళల
దిద్దుకొనవోయి! యీనాడు తెలుగు బిడ్డ!

---


# బ్రహ్మాలీల

రచన :- వి. వి. శాస్త్రి.

అతి మధురమైన మాటల కొటపట్టు - ఉపమానాల కునికి పట్టు - పదాలంకారాల పట్టుకొమ్మగా తయారయిన సాటిలేని మేటి "వీర బ్రహ్మంగారి" గొప్ప స్టేజీ డ్రామా ; ఇంపైన యిన్నూరు పద్యాలతో-అడుగడుగునా ఆనందాన్ని చిందించే మాటలతో మరపురాని మా బ్రహ్మాలీల కొరకై త్వరపడండి.

విడిప్రతి 1కి రూ 2__0__0 మాత్రం.

చిరునామా :- శ్రీ నాగేశ్వరీ నిలయం, గుంటూరు.
అరండల్ పేట (పోస్టు) సాలెపేట 2వ, లైను.

# నిరుద్యోగి

## ( నాలుగో రంగం )

[ వేంకటప్పయ్యగారింటి ముందు – మాసినబట్టలు, రేగిన జుట్టు, ఆకలి బాధతో మురళీధరుడు. ]

మురళీధరుడు :– అమ్మా! ఆకలి—అమ్మా! అమ్మా!

మంజు :– (లోపలినుండి బయటికివచ్చి) ఎవరివి నీవు?– ఎందు కొచ్చావు?

ముర :– నేనిప్పు డెవరినో నాకే తెలియుటలేదు — నీ కెలా చెప్పటం?

మంజు :– అడిగినతోడనే చెప్పక అనుమానిస్తా వెందుకు?

ముర :– బాధలు కలిగేటప్పుడు బ్రతికి చెడినవారికి అనుకో కుండానే అనుమానా లొస్తుంటాయమ్మా!

మంజు :– బిచ్చాని కొచ్చినా బిగువు తప్పలేదే?

ముర :– బిగువు తప్పిందికనుక నే బికారిలా తయారయేను.

మంజు :– ఈమాట యింకా బావుంది. పకీరులా తిరిగే బికా రివి కాకపోతే, షికారుగా వచ్చిన షావుకారివని ఎవ రన్నారు? నీ వెవరవయిందీ నీ మొఖమే చెబుతూంది.

లలిత :– (వచ్చి) ఎవరే మంజూ! ఏదో మాటాడుతున్నావు?

మంజు :– ముష్టికుంక యెవడో–మొండివాదన కొచ్చేడు.

మురః— అవునమ్మా! అవును. మూడురోజులనుండి మెతుకు లేని ముష్టికుంక— "ముద్దవెయ్యండమ్మా" అంటూ వీధి ముంగిలి కాచుకున్నాడు. కరుణించి కాస్త అన్నంపెట్టించండమ్మా!

లలిః— "ముద్ద వెయ్యండమ్మా" అంటూ మొద్దులా నిలుచుండకపోతే కష్టం చేసుకొని కడుపునిండా తిండి తినరాదూ? ఇదేం, రోగమా? భోగమా?

మంజుః— ఇంటింటి మెతుకులు వంటబట్టాక చమటూడ్చి చాకిరి చేస్తారటే? చీమూ నెత్తురులుంటే చెంగు ముడేసుకొస్తాడూ? ఎద్దులాగున్నాడు — ఏం తీపరం? అసలీ సోమారిపోతులకు అన్నంపెట్టితే దేశాన్ని మనమే నాశనం చేసినవాళ్ళ మవుతాం. మాయరోగం — మరియాదగా చెపుతూంటే పోతాడేమొ చూడు—

లలిః— అంతస్తుగలవారికి అడుక్కు తినేవాడితో మరియాద యేమిటే? వాకిలిమూసి పోదాంరా—వాగి వాగి వాడే పోతాడు.

మంజుః— మొండిపీనుగ పోతుందటె? — మొత్త కాచుక పడుంటుంది కాని;

లలిః— పొమ్మనంగానే పోతే పొట్టనిండొద్దూ? పెట్టాలిసిందేదో పెట్టు. వెనుక మొగంలేకుండా వెళ్ళిపోతాడు.

మంజుః— పెట్టొద్దూమరి? ఏమిటి పెట్టేది—వాతలా?

లలిః— వాతలు పెట్టినా యీ జబ్బు వదిలేదికాదు. చూడూ!

ఆంబోతులా బాటకెలా అడ్డం నిలుచున్నాడో?

ముర :- అయినవారందరికీ అడ్డమయినందునే యిందాకా వచ్చాను. నిరుపేదలకు యీలోకంలో నిలవటానికి నీడేలేదు కాబోలు.

మంజు :- నీలాంటి నిక్షేపరాయుడు అడ్డం కాకపోతే అండవుతాడా?

ముర :- అవునమ్మా! అవును — నిత్యమూ నేనిలా నిక్షేప రాయుడుగానే వుంటే నా యాంధ్రదేశానికి—నా యాంధ్ర కీర్తికి వుపకారం చేయలేకపోయినా అపకారం చేయను గదా! అని అనుకుంటున్నా.

లలి :- కాళ్లూ, చేతులు బాగావుండి గాడిదలా తిరిగేవాడివి, కష్టార్జితం చేసుకునేవారి గడపలముందు "దేహీ" యని చేయి చాచటం దేశద్రోహం కాదూ?

ముర :- కష్టంచేసుకునేవారికి కడుపునిండా అన్నముంటుందటమ్మా?

లలి :- మనిషిచూస్తే మలపరామన్నలా గున్నాడుకాని— మాటలు వింటూంటే మాలావు ఘాటుగా నున్నాయే?

మంజు :- దేహం తెగబలిసి దిక్కుతెలియనివాడు మాలావు ఘాటుగా మాటాడకపోతే మామూలుగా మాటాడుతాడా?

ముర :- బ్రతుకనేర్చిన భాగ్యవంతులుండగ తిండిలేనివారెలా తెగబలుస్తారమ్మా?

లలి:- చూచావే మంజూ! చుంచు వెధవ——ఎంతమాటంటె అంతమాట వెనకా ముందూ లేకుండా అంటూంటె——

మంజు :- నాన్నగారొచ్చేక చెప్పి నడ్డి యిరగకొట్టిస్తేగాని, గుణం కుదిరి వీడు గుడిశకు చేరుకోడు.

లలి :- నాన్నగారి చేతిలో నాలుగూతినక ముందు తెలియ జెప్పితే మాత్రమూ తెలుసుకుంటాడా? దెబ్బతోకాని దెయ్యం పారిపోదు.

మంజు :- ఈ చవటల కంటాకా యెందుకు తెలుస్తుంది?

ముర :- చదువుకొన్న గొప్పవారికే తెలీదుకదా? చవటలకేం తెలుస్తుందమ్మా?

మంజు :- అంత అభిమానం గలవాడివి అడుక్కు తినకపోతే చదువుకొని అధికారం చలాయించలేక పోయేవా?

ముర :- చదువు——చదివి యేం చేయటానికి? నేనుచదివిన చదువుచేతనే నేనిలా చెడిపోయాను. ఆ చదువు లేక పోయినా హాయిగా వుండే వాడినేమొ——

మంజు :- ఏం చదివావేం? ఎఫ్,ఎ-చదివావా? బి,ఎ-చదివావా?

ముర:- ఎఫ్,ఎ-చదివానంటె ఎవరునమ్ముతారు? ఏమిలాభం?

మంజు :- ఎవరయినా నమ్ముతారు-ఏమైనా లాభముంటుంది.

ముర :- అయితే, ఎఫ్,ఎ-ఫస్టుక్లాసులో పాసయేనమ్మా!

మంజు :- ఎఫ్,ఎ-పేసయేవా? ఏం ఉద్యోగం చేస్తున్నావు?

లలి :- "ఏం ఉద్యోగం చేస్తున్నావ"ని యింకా అడుగుతా వేమే? కళ్ళముందు కనబడుతూంటే—నిరుద్యోగం చేస్తు న్నట్లు నీకు తెలియటం లేదూ?

మంజు :- ఓహో! నిరుద్యోగి ఎఫ్,ఎ-అంటే నీవేనేంటి? ఏం పనిమీద తమరిలా దయచేశారు?

లలి :- వీధులవెంట విజిట్ చేస్తున్నారు.

మంజు :- నిరుద్యోగి ఎఫ్,ఎ-గారూ! నిరాక్షేపణగా దయ చేయండి.

ముర :- దయచేయటానికే దారి కనుపించటం లేదమ్మా! అమ్మా! కళ్లు తేలిపోతున్నాయ్! కాళ్లు గుంజుకు పోతు న్నాయ్! అబ్బా— (అంటూ పడిపోవును.)

మంజు :- పడిపోయాడు—పడిపోయాడు.

లలి :- ముంతాలూ! ముంతాలూ!

ముంతా :- (పరుగెత్తుక వచ్చి) ఏమ్మా! ఎందుకలా కేక లెట్టారు?

లలి :- ఎవడో వెధవ — మనింటిముందు పడిపోయాడు — మంచినీళ్లయినా తెచ్చి పోయి.

ముంతా :- అంతేలెండి. (పోవును.)

లలి :- మంజూ! పాపిష్టిముండాకొడుకు — ప్రాణాలు విడు వడు కదా?

మంజు :- దరిద్రుడు చస్తే దండుగేముందిలే—ఉన్నా వకటె, పూడినా వకటె.

లలి:- అదికాదే!—పారేయటానికి పనివాళ్లెవరూ లేరని.

ముంతా :- (నీళ్ల చెంబుతో వచ్చి) అబ్బీ! నీళ్లు — మంచి నీళ్లు — తాగు (అంటూ కొంచెం కొంచెంగా తాగి స్తుంటాడు.)

వెంకటప్పయ్య :- (కారులోనుంచిదిగి, కారును పెడుకు తీసు పొమ్మని సైగచేసి) ఏమిటమ్మా! ఇదంతాను?

మంజు :- ఎవరో నాన్నా! ఇందాకా వచ్చేడు. మనింటికి సరిగా రాగానే మాటా మూటా లేకుండా పడిపోయేడు.

లలి :— మన ముంతాలును పిలిపించి మంచినీళ్లు పోయి స్తున్నాం. నాన్నా!

వెంక : చావలేని వెధవ - మనింటిముందు చావమని ఎవడు చెప్పాడు? అహ్హాఁ- యెవడు చెప్పాడూ అంట?

ముంతా :- అంతేలెండి. యమధర్మరాజావారి ఆఫీసుకు రిపో ర్టుచేసి చిత్రగుప్తుణ్ణి డిస్మిస్ చేయించాలాఅంటే చేయిం చాలండీ !

వెంక :- ఏడిచావులేవోయ్, యెనక ముఖమా!

ముంతా :- అంతేలెండీ.

మురః- (తెప్పరిల్లుతూ, మెల్లగా) అబ్బా!

వెంక :- ఎవరివోయ్ నీవు? యిక్కడ చచ్చావు—

మురః- భారతావనిమీద భారమైనవాడినయ్యా!

వెంక :- భారమని తెలుసుకున్నవాడివి బ్రతికావేం? చచ్చిన వాడివి చావకుండా—

మురః :- చావనీయకుండా మీ రడ్డుపడితే చావటమెలా?

ముంతా :- అంతేలెండి. చావకపోవటం మీకే రోజొక ఛాన్సు పోయిందన్నమాట. చచ్చినోడి పేరే మార్కెటులో చలామణిలో వుంది. అందులోకూడా ఆకలితో చచ్చిన వాడికే అగ్రతాంబూలం అందుతూంది. ఊపిరి సొంతంగా పోయీ పోకముందే "ఓ, కె"—అంటూ కెమెరాలో వైపునుండి వూడిపడేయా? — "ఆకలి బాధతో ఆంధ్రుని మరణమం"టూ పత్రికా విలేఖరులు పరుగెత్తుకపోయి న్యూస్ పేప రాఫీసులకు వ్యాసా లంపే వారా? — "తెలుగువారికిది తీరని విషాదమం"టూ డాంబీకులంతా డబ్బాలు కట్టుకొని బజారులలో బహిరంగసభలు జరిపేవారా? — "కాల గర్భంలో కలిసిపోతివిరా సోదరా! నీకిదే నా సోదిరా"! అంటూ కవుల కలాలు కాగితాలమీది కెక్కేయా? అప్పుడు మీ శవానికి అలవిమాలిన వూరేగింపు జరిగిగేదా? మీపీనుగు పూలలో మునిగిపోయేదా? ఇంకా—యింకా—

వెంక :- (కోపంతో) నోర్ మూయ్!

ముంతా :- అంతేలెండి.

మురః :- అంతే నాయనా! అంతె—శవంమీద చల్లటానికి సంపెంగ పూలున్నాయికాని, వూపిరితో నున్నవారికి

వుమ్మెత్తపూలు లేవు—ప్రాణాలు పోయినాక పాలూ, పంచదార లొస్తాయికాని, బ్రతికుండగా బక్క-నీళ్లు దొర కవు—నిజ మాలోచిస్తే నీవు చెప్పినట్లు మరణించడమే మహాదృష్టం—బ్రతికుండటమే భారంలాగుంది.

వెంక :- నీ వెవరవోకాని నిజం చెప్పావోయ్! చాకిరి చేయ లేని చవటలు చావటం దేశానికి చాలా మంచిది.

ముర :- చాకిరి చేస్తానంటే మాత్రం చేర్చుకుంటానికి చాలి నవా రుండొద్దూ?

వెంక :- మా యింట్లో మరో పనివాడు కావాలి— మరి, కుదురుతావా?

ముర :- ఆ మాత్రమయినా మీ రనుగ్రహిస్తే యింటిమనిషినై యే పనయినా చేస్తాను.

వెంక :- జీత మెంత?

ముర :- జీవితమానంగా జరుగుతూంటే జీతంమాటెందుకండీ!

ముంతా :- అంతేలెండి. మనుసు కుదుర్చుకొంటే మనిషి కుదరక పోతాడా?

వెంక :- తీసుకపోయి తిండిపెట్టక మాటలు చెప్తూ పని మరిచావేమోయ్ ముంతాలూ!

ముంతా :- అంతేలెండి.

వెంక :- (మురళీధరతో) అయితే లేచి అన్నం తినవోయ్!

ముర :- అలాగేసార్! (ముంతాలుతో లోనికిపోవును)

[వెనుక తెర లేస్తుంది. డ్రాయరు, నాలుగు కుర్చీలు వేసి వుంటాయి. వెంకట్రామయ్య, లలిత, మంజు కూరుచుంటారు.]

మంజు :- హేయ్! మిష్టర్ నిరుద్యోగి ఎఫ్,ఎ-కాఫీ పట్టుకరా!

వెంక :- (నవ్వి) అదేమిటమ్మా—ఆపేరు? నిరుద్యోగి అనే పేరు నీవు పెట్టావేం?

మంజు :- అవును నాన్నా! ఎన్నాళ్ళకూ పేరు చెప్పకపోతే యేమని పిలవాలి?

లలి :- అంతేనాన్నా! అదే బావుంది. నిరుద్యోగినంటూ మనింటి కొచ్చేడు—నిరుద్యోగి అని మనం పేరు పెట్టేం.

వెంక :- బాగుందమ్మా! బలే బాగుంది.

మురః :- (మూడు కాఫీలు తెచ్చి బల్లమీదుంచి—నిలుచుని) వేడి తగ్గుతుందేమో, వేగం తాగండి బాబూ!

మంజు :- మాటలు చెప్పకపోతే—మరికాస్త మంట పెట్ట రాదూ?

మురః :- మంట పెట్టిందాకా మనసు నిలిస్తేగా?

వెంక :- ఆమాట నలావుంచి అడిగినదానికి ముందు చెప్పు— నీ పేరెన్ని సారులడిగినా చెప్పలేదు కాబట్టి నిన్నీ రోజు నుండి "నిరుద్యోగి" అని పిలవడానికి నిర్ణయం చేశాం- బాగుందా?

మురః :- బాగుండేమాట భగవంతుడికి తెలియాలి.

మంజు :- ఏయ్! నిరుద్యోగీ! స్నో బాటిలు నిన్న సుప్తాగా అయిపోయింది కదూ? కొత్తదాని నేమయినా కొను క్కొచ్చేవా?

ముర :- ఇంకా లేదు—

మంజు :- ఎందుచేత?

ముర :- తీసుకరమ్మన్న "స్నో" పేరేదో తేల్చిచెప్పేరుకారు. కాశ్మీర్ స్నో తెస్తే కాదనొచ్చు—రాజా స్నో తెస్తే రాసుకోకపోవచ్చు—పారిస్‌స్నో తెస్తే పనికిరాదనొచ్చు- అందుకని, అడిగాకే......

మంజు :- (చిరాకుతో) అడిగావులె—అడిగేదేమిటి? ఈ స్నో లేవీ పనికిరావని యెన్నిసారులు చెప్పేను? మురళీస్నో తప్ప ముట్టేదిలేదని ముప్పైసారులు మొత్తుకున్నాను.

ముర :- అవునవును. ఆమాట మరిచిపోయేను. ఇపుడేకొను క్కొని యిక్కడున్నట్టు లొస్తాను. (రెండడుగులు వైచి, వెనుకకు తిరిగి, మరిచిపోయినట్లు నటించి) మతి మరుపు మళ్లీ వొచ్చిందె—ఏ స్నో దెమ్మన్నారో, యింకోమారు చెప్తారూ?

మంజు :- (కోపంతో) "ఈసారి, యీసారి" అంటూ యెన్నిసా రులు చెప్పమంటావ్? మురళీస్నో-మురళీస్నో-మురళీస్నో మూడో సారడిగేవా?—

ముర :- (సంతోషంతో) ఓ—ఐయాం సారీ—ఈమాట నీనోట యెన్నిసారులువిన్నా యింకా విందామనిపిస్తుంది

మంజూ! (పొరపాటని తెలుసుకొని) పొరపాటు—పొర పాటు—"మంజూదేవి" అనవలసింది. మంజూ అన్నాను. ఎక్స్క్యూజ్ మి.

లలి :– "ఎక్స్క్యూజ్ మి" అంటూ యింగ్లీషు మొదలెట్టావే?

మంజు :– ఎఫ్,ఎ–చదివినవాడు యింగ్లీషు మాటాడడటే?

వెంక :– ఎంగిలి కూతొకటి మెక్కడ పట్టుకొన్నాడోలే — (అందరూ నవ్వుతారు)

మురు :– పరాకుపడి పొరపాటు చేశాను. మహారాజులు మన్నించాలి.

మంజు :– పొరపాటులు చేయటం నీ కలవాటులా గుంది?

వెంక :– నిరుద్యోగీ! నెలదాటి పోయినా నీ జీతం మాట చెప్పవేం?

మురు :– అదంతా మీ యిష్టమేనని ఆనాడే చెప్పేనుకదండీ?

వెంక :– అయితే యిందు. ఈ పదిరూపాయలు పుచ్చుకో.

మురు :– (తీసుకొని) ఈ పైకంతో యేం చేయమంటారు?

మంజు :– మంగలి షాపుకెళ్ళి తలా, గడ్డం కాస్త మర్మత్తు చేయించు—బట్టల సబ్బొకటి తెచ్చుకొని బావిదగ్గర బట్టలుకాస్త గుంజేసుకో — నీ మొఖం చూడాలంటే ముందు నేను సిగ్గుపడుతున్నాను. —

మురు :– అలాగేనండి! (వెళ్ళిపోవును.)

సత్తారుసాయిబు :- (వచ్చి) మహారాజా, హెంకటప్పయ్యా గార్కీ మెహర్బానీ సలాంజీ!

వెంక :- సత్తారు సాయిబుగారా! సమయాని కొచ్చేరు. (కుర్చీచూపించి) రండి, కూర్చోండి. ఆ—సమాచారా లేమిటండీ సాయిబుగారూ!

సత్తా :- షమాచారంమాటా అంటే షచ్చినంత పని హైతీంది సర్కార్!

వెంక :- అదేమిటండీ! అలా మాటాడుతారు.

సత్తా :- మాటా కాకపోతే హేంటీ మహారాజ్! మాకి హూాకా లడికీ హుండాది. మీాకు తెలిసి హుండాదీ లేదూ?

వెంక :- అవునువును. అమ్మాయి వున్నది.

సత్తా :- హాదీ, సర్కార్! హాది — హాయితే! హేంటీ హాయిందీ హాంటే — మొన్న పోయిన పండక్కీ మొగ్గూ హాత్తోరింటికి తెచ్చాం జీ!

లలిత :- అంటె—పుట్టింటి కన్నమాట?—

సత్తా :- జీహ్హా-జీహ్హా—హామేకీ పంటీ పిన్నూ కావావాలా హాంటే హం బాజార్‌కీ జాగయా సర్కార్! హాడా పొద్దూ లెగ్సిపోయింది.

లలిత :- ఏమిటి! పిన్ను పట్టుకొచ్చేవా?

సత్తా :- పిన్నూ నై పేషుకొని హింటికిపోతే పీచు పీచు

రేగి—ఘర్ మే బఢా గడిబిడీ లెగుస్తాది. లడీక్సే లడా యి పడాలేన్ మహారాజ్!

లలిత :- ఎలావుందో యిలా చూపు.

సత్తా :- హామ్మాయీ వారూ హడ్డితే హడ్డూమాటా హుం టుందా? షూడండిహామ్మా షూడండీ! (ఇచ్చును.)

లలి :- (తీసుకొని పొట్లం విప్పిచూచి) ఏ పాపులో చేయిం చారో కాని యెంతో పనితనంగా వుంది.

సత్తా :- హాచ్చం పవర్లూకొని హార్గరూహిచ్చి షేహించాం.

లలి :- మంజూ! చూడవె. యెంత మోజుగా వుందో?

మంజు :- (చూచి) ఎంతైనా బావుంది! ఇంతవర కీలాటిపిన్ను యెక్కడా చూడలేదు.

వెంక :- ఏదీ చూద్దాం. (తీసుకొనిచూచి తిరిగిఇచ్చి) సాయి బుగారూ! సరదాగా వుందండి. ఈ రాళ్ళిక్కడనే కొన్నా రా? ఎక్కడనుంచేనా తెప్పించేరా?

సత్తా :- మొన్న గుంటూర్కి పోయినానూలేదూ? మున్గాలా వారి దుకాణంమే తెప్పించాం జీ!

వెంక :- గుంటూరులో యింత గొప్ప వ్యాపార ముందా? మునగాల వారిలో యిలాంటి వజ్రాలమ్మే మొనగాడు న్నాడా? అహ్హా-వున్నాడా అంట? ఆయన పేరేమిటో అడ్రసుతో గూడా చెప్పండి.

సత్తా :- మున్గాలా నరసయ్యా సన్, కేశవారావ్వూ గుపత. మెయిన్ రోడ్, గుంటూరు.

లలి :- ఎరుగనివాళ్లుపోతే యేమయినా దగా వుంటుందా?

సత్తా :- హాఁడా, మగా హెఁత్రృా పోయినా పద్మాక్షకాతనం హాఁడా పస్కారాద్ మహారాజ్! హూక్కి మాటా-హూక్కి బాటా. ఉస్కా షాఫ్రామే హుండాది హేంటీ హంటే? ఫాయిదా హై-ఫర్వానై. సచ్ బాత్‌కీ సలాం-ఝూటా బాత్‌కీ సైతాన్! జో స్త్రీవాలా ఘురానా-ఘుట్ ఫట్ వాలా దివానా. క్యాప త్తర్?—క్యాప త్తర్?—కల్లూతిర్గి పోయి గాభరా హెత్తిందాకా కాంతుల్, కాంతుల్ కక్కుతుండాయ్ సర్కార్!

మంజు :- అవును. సూర్యకిరణాలను మించిన శోభాయమానంగా—నక్షత్రాలనుమించిన నాణ్యంగా—రవ్వలకంటె రాజసంగా మిడిసిపడి మెరుస్తున్నాయి.

లలి :- కాదే మంజూ! పెట్రోమాక్స్ లైట్సుకంటె యెక్కువ ఫోకసు యిస్తున్నాయి. రవ్వలో, రత్నాలో మరి—

సత్తా :- హాయ్యి రవ్వల్ కావు—గవ్వల్ కావు హమ్మాయీ గారూ!

మంజు:- నాన్నగారూ! ఇలాంటి పిన్ను నాకూ చేయించరూ?

వెంక :- పచ్చి కరువుకాలం కదా—పైకమెక్కడిదమ్మా?

సత్తా :- గరీబ్ కా బాత్ ఘురానా వారు బోల్తాహుంటే హింకా హేంటీ షెయ్యావాలా సర్కార్!

వెంక :- కరువుకాలంలో బతికి బైటబడితే కాలుని పాశంలో నుంచి బైట పడినంత పనిగావుంది. సంగతేమిటంటే ?

సాయిబుగారూ! దగ్గిరవాడవు నీవద్ద దాపరిక మేముంది
కాని—"పర్మిటుకావాల"ని వచ్చేవారి వద్ద పైసాగుంజే
వాడినయితే, గారడివాని డబ్బాలో రూపాయల లాగా
గలగల మనిపించక పోయేవాడినా?

సత్తా:—ఆప్‌నాకా పిత్తం "అంగార్ కా పాస్ హెన్నాపూసా"
హాని భడా, చోటా హందర్కీ బాగా తెల్సీ హుండాదీ
సర్కార్! మత్‌లబ్ హాక్కీ మన్సీ పేస్త్రాన్. మీకీ బుద్దీ
హుండాదీ లేదూ, మోటా హిన్నాపుముక్కా హానోకుండి.
కానా, కష్టా లేనివాడూ మీ శాల్లూపట్లుకొంటే తుమాం
రా మన్సూ లేదూ?—తాడూ హిర్గీనట్లు హిర్గీపోయీ—
కాడీ తెగినట్లు తెగిపోతాడి. హెంతా మెత్కాబుద్దీ?—
హెంతా మెత్కాబుద్దీ?—

మంజు:— పైక మొచ్చేక పంపస్తామంటే పద్దు రాసుకొని
పిన్నిచ్చారా నాన్నా?

వెంక:— పదిరోజుల పాటాగుతల్లీ! పైకమేదైనా వస్తుందేమొ—

సత్తా:— హామ్మాయి వార్కీ హంతా హానమగం హాయితే
హాదే పిన్ను హుంచుకోండి మహారాజ్!

వెంక:— మీ అమ్మాయికి పట్టుకపోయే పిన్ను మా అమ్మా
యి కెందుకండీ! (మంజుతో) సాయిబుగారి పిన్ను సాయిబు
గారి కివ్వమ్మా! మరోపిన్ను మనం తెప్పించు కుందాం.

సత్తా:— తియ్యాహొద్దు—హియ్యాహొద్దు. తెచ్చినపిన్నే
హుంచూకోండి మహారాజ్! మరొకపిన్ను మా యింటీకి

తెచ్చుకొంటాం.

లలి :- నాన్నగారివద్ద డబ్బు లేదంటూంటే—నాలుగురోజు లపాటూగుతావా?

సత్తా :- పంతుల్‌గార్కీ పైకం హడ్గుతానా? హేలినవారి కటాచ్చం హింత మామీాదా హుండావాలా కాని—

వెంక :- లంచంగా యీ పిన్నుమాకు లభింప చేస్తున్నావా?

సత్తా :- హెంతా మాటా బోలినార్ సర్కార్! హెంతా మాటా బోలీనార్. లంచం మాటా మీారూ హంటే లచ్చల్ లచ్చల్ మీాకీ రాకపోతాయా మహరాజ్! పానీ తిని—ఖానా తాగేవాడు హెవ్రూ హంటాడ్ సర్కార్! హెన్ని గుండెల్ పెట్టుకొని హంటాడ్?

వెంక :- అవన్నీ యిప్పుడెందుకుగాని, అవసరంగా మాటాడే దేమిటంటారు? (మంజు, లలితనుచూచి) లలితా! మంజూ! లోపలకు వెళ్ళండమ్మా!

లలి, మంజు:-అలాగేనాన్నా! (యిరువురూ లోనికివెళ్లుదురు.)

సత్తా :- కష్టాకా కోటా నిన్నటికి కాళీహాయింది సర్కార్!

వెంక :- నీవు కావాలంటే నిముసంలో తెప్పిస్తాను.

సత్తా :- హిన్నాకోటా హీ నెలే హుండాది సర్కార్.

వెంక :- నెల జరగనివ్వు-నేనున్నానుగా?

సత్తా :- బియ్యపుకోటా మాటాహంటే నాకీ గుండె బేజా రెత్తి పోతూండాది సర్కార్! మొన్న కోటామే సన్నా

బియ్యం మూటల్ మీకీ పంపించి హుండానూ లేదూ? గాం మే హంతా గబ్బూ లెగిసింది మహారాజ్! నిల్వ చేసిన చావల్ కొల్వకాపోతే "బ్లాకూ మారికెట్ బేరం బైటా హేస్తామ"ని హల్గా జనం హంతా హడావడీ షేషిందీ సర్కార్!

వెంక :- ఏడిచారు వెధవలు—ఒక్క గింజనైనా చిక్కనివ్వకు. కడుపులోమంట కాల్చేస్తుంటే — కానీకొక గింజంటే మాత్రం కొనకా, తినకా తప్పేదేముంది? "నోస్టాక్"అని నోటీసంటించి—యింట్లో కూర్చో. ఏం చేస్తారో చూద్దాం.

సత్తా :- కొట్టూ తెర్సి చూపావాలాహని గోలా షేసితే హేంటీ షెయ్యటం?

వెంక:- ధాన్యమంతా మరోచోటికి దాటేయలేక పోయేరా? ఎత్తుగడవేసి యీ-యెత్తు తప్పుకోవాలగా? (ఆలోచించి) కాదూ కూడదని వాళ్ళంటే — కసీబిసీ మీరు రెండరిసి "కొట్టులో గింజ లేకపోతే వందరూపాయలు కట్టేవా డెవడో తాళాలు తీసుకొని తలుపు తీయమం"టూ ధైర్యం చేసి దబాయించెయ్యండి. (కొంచెం మాగి) నూకలులేక నకనకలాడేవాడెవడు చెప్పండి—నూరురూపాయలుకట్టేది?

సత్తా :- బహూత్, హచ్చాజీ! బఢా బుఢ్ఢా మీంగీ హుండాదీ— బేగి దాడ్ తీస్తాదీ సర్కార్!

[ తెర ]

# నిరుద్యోగి

## ( ఐదో రంగం )

[ రేషన్ కొట్టుకు తాళంవేసి సత్తారు సాయిబు నిలుచుంటాడు. రామయ్య యెదురుగా వుంటాడు—జనులు గుంపులు గూడి వెనుకగా నిలుచుంటారు. తెర లేస్తుంది. ]

సత్తా :— ( సాంగ్ )

చలో, చలో భాయ్! తుం—చలో, చలో—భాయ్!
చావల్ నై, గీవల్ నై—చలో, చలో—భాయ్ ॥చలో॥

రామయ్య :— సోలెడు నూకలన్నా యివ్వకుండా సున్నా చుట్టి చూపితే యింటికిపోయి యేం తిని బతకమంటా వయ్యా?

సత్తా :— బతా్క—లేకపోతే చిత్కి—పోండయ్యా! పత్రావందల్ టన్నుల్ కా బియ్యం పానీమే మున్గిపోయింది అంటా. హాడా కోటా నై—హీంకా చావల్ నై. హింకా హేంటీ మెయ్యావాలా?

రామ :— చీకటికొట్టు బియ్యంతీసి చీటీకో శేరుచొప్పునైనా యివ్వండి. గుక్కెడు గంజినీళ్ళైనా వుంటె, గొంతైనా తడుపుకొంటాం.

సత్తా :— పారెడు గింజల్ లేక మేమే షచ్చిపోతూహుంటే సీకటికొట్టు హెడా హుండాదయ్యా—సీక్టికొట్టు. సీక్టి

కొట్టూలేదు–సిట్టెడు చావలూ లేవు చలో! చలో!

మురళీధరుడు :–(గడ్డం, క్రాపుచేయించి, తెల్లబట్టలతోవచ్చి) ఏమిటీజనం?___ఎందుకొచ్చారు?

రామ :– బియ్యపు రేషన్‌షాపు బాబూ! బిచ్చం వేసినన్ని బియ్యంకూడా లేవంటున్నాడు. తాటాకుల మంటలా కడుపులో తగలబడి పోతుంది. కళ్లలో ప్రాణాలెట్టుకొని కడసారి చూపులు చూస్తున్నాం.

ముర :– షాపులో బియ్యం ట్టాకున్నదంటారా?

రామ :– బియ్యంలేకనా బాబూ! యియ్యలేక నేకాని–రేషను బియ్యమంతా రెక్కలుకట్టుక యెగిరి పోయిందా? భాగ్య వంతుల యిండ్లకు బండ్లతో పోతూంది. ఉన్న బస్తాల మూతులూడదీయక ముందె కొత్తధాన్యవచ్చి కోటలో దూరుతూంటే పేదవారి కెక్కడనుండి పిడికెడు గింజ లొస్తాయిబాబూ! చీకటికొట్టు తెరిపించండి. చేటలతో పంచాలన్నా కరువులేని గింజ కానొస్తుంది.

ముర :– కంట్రోలు నిర్ణయించింది కామందుల కోసమా నాయనా? కరువుకాలమైనా అరువుబేరంకాదే?__రొక్క మిచ్చేటప్పుడింత రొదెందుకు చెప్పండి? పిల్లా, జల్లా ఎలా అల్లాడి పోతున్నారో చూడండీ పాపం. ఆకలిడొక్క లంటుకపోయి ఆవురు మంటున్నారు. ముద్దకొరత్తైతే మొగంవాడే మనం ___ మూడురోజులనుండి క్షోభిస్తున్న వారి మొగాలు చూస్తుంటామా? కొట్టుతెరిచి బియ్యం

కొలిపించండి — పసిపిల్లల ప్రాణాలనైనా కనికరించి కాపాడండి. ఇంతమంది బీదలపక్షమున యీ దీనుడు మీకు సదయ చూపమంటూ సలాంచేసు కుంటున్నాడు.

సత్తా :- హదీకాదు భాయీ! హదీకాదు. మానెడు నూకల్ హుంటే నీకీమాటల్ హిన్ని హెప్పటం హెందూకు? నాకీ హినటం హెందూకు?

మురి :- సాయిబుగారి మాట సత్యమేనంటారా ?

రామ :- తాళం తీయమనండి బాబూ! తరుగులేని ధాన్య ముంటుంది.

సత్తా :- తాలంతీయ్ సాయిబూ! తాలంతీయ్ సాయిబూ! తాలంతీసితే హాజా హేంటీ హుండాదయ్యా? తాతాయ గారి తలకాయ - నాకీ తాలం తీయాకాపోతే - నాహింప్రా మీదా మీకీ తాలం హేసేలాగా హుండీ పోయార్? (తాళాలు యిసిరి క్రిందకొట్టి) కొట్టూమే గింజా హుంటే గుడ్డిపెసా నాకీహొద్దు—నూకత్ లేకాపోతే మీకీ నూరు రూపాయలు కట్టావాలా.

రామ:- బియ్యానికొచ్చేంకాని కయ్యానికొచ్చామా బాబా! పందెం పెట్టడానికి వందరూపాయలేవుంటే—చీటీ బియ్యం కోసం మీచేత చివాట్లు తింటామా?

సత్తా :- భేటాకీ చెప్పినట్లు హెబుతూంటే బేగీ గడిబిడీ హేసీ హేస్తావ్—మాటా హనుకుండావా? మజాకా హనుకుండావా?

మురః— కడుపుమంటతీరని కంగారుతనమేకాని — మీమ్మెది రించటం వారికేమైనా మేలు చేకూరుస్తుందా నాయనా!

సత్తాః— (కోపంతో) కడ్పామంటాహైతే కాల్వాలో పడా వాలాకాని—పక్కవాళ్ళమీదా పడితే ఫాయిదా హేంటీ?

మురః— ప్రాణాలు నిలుపుకోచూచేవారికి ఫాయిదా యేం తెలుస్తుందండి? అంత మాత్రాన మీా రావేశ పడాలా? (తాళాలు చేతపుచ్చుకొని) తమకంత తలనొప్పిగావుంటే వోపికపట్టుకొని వొదిగి నిలుచోండి. తలుపుతీసి చూపితే తలలొంచుకొని వాళ్లేపోతారు. నిజం తెలపటానికి నేనే పూనుకొన్నాను.

సత్తాః— (అడ్డువచ్చి) ముక్కూ మొగం తెలియని మొగాడివి హేడానుండి వొచ్చావయా? నా తల్పూ తీసిహేసితే నీ తలా తీసీహేస్తాన్. హియ్యాలా గొళ్లెంతీసి కొట్టు సూపా వాలా హన్నార్! రేపు గోషాతీసి పెళ్లాన్ని సూపావాలా హంటార్. భాయీా! బఢా ఆద్మీ హుండావ్. కాస్త కాఫీ తినిపిస్తాన్—కదలిపోదాం రా!

మురః— కడుపునిండాతిన్న నాకు కాఫీ యెందుకు నాయనా? కడుపు కాలుతూన్నవాళ్ళకు గంజినీళ్లుపోయక — కాఫీ నీళ్లిచ్చి, కదలకుండాచేసి, బోకరించే వారిని బుట్టలో పెట్టుకొందామనా? ఇంతదూరం వచ్చినా యీాలంచ గొండితనం దయ్యంలాగా నాకిక్కడా దాపరించిందా? ఒద్దు, బాబూ! వొద్దు. కాళీఫర్సుచేసుకొని కాఫీ నాకిప్పిం

చేదానికంటే —— కానీ లాభం చూచుకొని - కన్నతండ్రి లాగా బీదవారికిన్ని బియ్యమివ్వటం మీ కన్నివిధాలా మేలవుతూంది.

సత్తా :- బియ్యంలేవ్రా భాయీ హంటే బేజాన్ కబుర్లూ షెప్తావేమయ్యా? ధాన్నెం షూద్దామా దర్శినానికి-లేద్-మాటల్ షూసితే మహరాజులా గుక్క-తిర్గాకుండా గుప్పి హేస్తుండావు. తగ్గిషెపుతూంటే తలామీదీ కెక్కు-తావ్? షోదా షెయ్యటానికి వచ్చేవా? వాదూ హెయ్యటానికి వచ్చేవా?

మురః- సోదా లేదు——వాదూ లేదు. బియ్యముంటేగదా భీతి పడటం? తమరు కొంచెం తప్పుకోండి——తాళాలు తీద్దాం.

రామ :- (సాయిబుగారి చేయి పట్టుకొని) గాభరాపడి గందర గోళం చేయకండి. ధాన్యం లేకపోతే మేమే దక్కిస్తూ పోతాంగా?

మురః- (గొళ్లెంతీసి, తలుపునెట్టి) రండి——చూడండి.

సత్తా :- అరె అల్లా!

రామ :- రండిరా! (గుంపుతో గూడా లోనికిపోయి బియ్యపు బస్తాలుతెచ్చి బైటవేసి) సాయిబుగారూ! మాలావు సాహసంగా మాటాడారు? సోదా చేసినందుకు సొమ్ము దొరికిందే——

మురః- తప్పుచేసినవారిని తర్కించకూడదు నాయనా! మంచి మాటలతోనే వారిని మార్చటానికి సిద్ధపడండి——సిద్ధి

పొందొచ్చు. (సాయిబుగారితో) అయ్యా! సాయిబు గారూ! ఆలస్యమెందుకు? కూర్చొని కొలతారంభించండి- వేళతప్పుతూంది, వెళ్ళిపోతారు.

సత్తా :- హాయ్యి హియ్యావాలా హంటే హార్డరు హింకా రాలేదు భాయీ!

ఒకడు :- ఆర్డరులేదని మీరివ్వకపోతే ఆగలేమని మేమే యెత్తుకు పోతాం.

సత్తా :- హాంతపనీ హెందుకు-భాయ్. (కూర్చొనును.) (తెర)

---

## ఋణదాత

రచన :- వి. వి. శాస్త్రి.

పల్లెటూరి రైతాంగపు తేటతెనుంగు పదాలతో నలరారు కమ్మని పద్యాలు—అప్పుబడ్డ రైతుల కష్టాలు—బాకీదారులను నాశనముచేసే ఋణదాతల కుత్రిమాలోచనలు— తమాషాగా నవ్వించే సామెతలు—అందమైన వాక్యాలతో తయారయిన గొప్ప సాంఘిక స్టేజీడ్రామా!

అంతయేల? ఒకసారి చదివి చూడండి. పాఠక మహాశయులు జాగుచేసి తరువాత కాపీలంద చేయలేకపోయిన మమ్ము నిష్ఠూర పెట్టవద్దని మనవి.

మీ కాపీకై నేడే వ్రాయండి. ప్రతి 1కి రూ. 1—4—0

చిరునామా :- శ్రీ నాగేశ్వరీ నిలయం, గుంటూరు.
అరండల్ పేట పోస్టు, సాలెపేట 2వ లైను.

# నిరుద్యోగి

## ( ఆరో రంగం )

[వెంకటప్పయ్యగారి యిల్లు; లలిత, మంజు.]

మంజు :- లలితా! నిరుద్యోగి యింతందగాడని నే ననుకోలేదే.

లలి :- (నవ్వి) ఆ అందాన్ని చూచి నీమనసు చిందరవందరయై పోతున్నదా?

మంజు :- చిందరవందరయై పోవటమేమిటే?—చేతికి చిక్కకుండా పోతూంటే—

లలి :- అయితే మనసు కుదిరిందన్న మాట.

మంజు :- చెదిరిందని చెబుతూంటే కుదిరిందంటా వేమే?

లలి :- మరులు దిరిగిన మగువ మనసు మొదట చెదిరి పిదప కుదురుతుంది.

మంజు :- కుదిరిందనుకుంటె మతి కుదట పడినట్లె.

లలి :- వంటింటి కుందేటికోసం వలలు పన్నాలటే?

మంజు :- వలపుతో సాధించేదానికి వలలెందుకుగాని—పెళ్లి చేసుకుంటానంటే నాన్న పల్లుకొరకడు కదా?

లలి :- మొత్తంమీద నీమనసు ముదురుపాకంలో బడినట్లుంది.

మంజు :- ముదురుపాకంలో బడితే మొరటుతనమేగదే? సమపాకంలో వుండబట్టే సరసంగా వుంది.

లలి :- నీ సరసాల కాతడు సమ్మతిస్తాడా?

మంజు :- సమ్మతించక పోవట మాతనికి సాధ్యమైనపనా? మంజుమీద మనసుపడింది కాబట్టే ఆనాడు మనింటి ముందు పడ్డాడు.

లలి :- మనింటిముందు పడ్డాడో — మంజు కంటిముందు పడ్డాడో నీకు తెలియాలి — నీ నిరుద్యోగికి తెలియాలి.

ముర :- (వచ్చి) నాకేం తెలుసమ్మా! నన్నడగటానికి—

లలి :- తెలిసిందంటూ వుంటే తేటగా చెప్తావా?

ముర :- చెప్పగలిగుంటె చెప్పటానికేం?

మంజు:- నిరుద్యోగీ! నీ జమైన పేరేమిటో నేడైనా చెప్పవూ?

ముర :- ఏ పేరయితేనేంలెండి—యిలా పిలుస్తున్నారుగా.

లలి :- పేరు చెప్పమంటే పెనగులాడతా వేం?

ముర :- మీరు ప్రేమతో పెట్టినపేరు మార్పు చేయటం యిష్టంలేక—

మంజు :- పోనీ—వూరిపేరయినా వోమాటు చెప్పరాదూ?

ముర :- మనిషిపేరుతోనే వూరిపేరూ మనవి చేస్తాలెండి.

మంజు :- పేచీకి పెద్దలాగున్నావే—మరినీకు, పెళ్లయిందా?

ముర :- పెళ్లయితే యిల్లువీడి రాగలనా? పెళ్ళికావలసిన వాడను కాబట్టే యింటిపేచీ లేకుండా మీ యింట నున్నాను.

లలి :- మాలావు చతురుగ మాటాడు తున్నావు? మా మంజును చేసుకొంటావా యేం?

మురి :- అడగకముందె ఆంటగట్టడానికి "చేసుకొంటావా" అని అడుగు తున్నారు. చౌకగావుందా మీ మంజు?

లలి :- బిచ్చానికొచ్చినవాడివి బేరాలు మొదలెట్టావే?

మురి :- నిరుద్యోగినై మీ యింటికొచ్చి నెలకో పదిరూపాయలు సంపాదించాను గదా?

మంజు :- ఎఫ్,ఎ- చదివినవాడికింకా యెంత జీతం కావాలో చెప్పరాదూ?

మురి :- పదిరూపాయలైనా నేను పట్టుదలగా అడిగేనా?

లలి :- ఆ పదిరూపాయల తోనే ఆలిని సంపాదించా లను కున్నావా?

మురి :- జీతగాడితో యింత చెతురు లెందుకు లెండి.

లలి :- ఇంటికి జీతగాడవయినా___యింతికి చెలికాడవుగా?

మురి :- అంత మాటెందుకమ్మా?

లలి :- అంతకు మించిన అంద చందాలు నీయం దెంతైనా నిలిచివున్నాయి కనుక.

మురి :- అందంవుంటే సరా? ఆస్తీ, అధికారం వుండొద్దూ?

లలి :- అంట గట్టుకొన్న అమ్మాయి వైపున___

మురి :- లభిస్తుందంటారా?

మంజు :- లక్ష రూపాయలకు పైగా.

లలి :- నాన్నగా రొస్తున్నారు——నాన్నగా రొస్తున్నారు.

మంజు :- కోపంతో వస్తున్నట్లున్నారు-కొంచెం తప్పుకొంటం మంచిది. (అని అందరూ లోపలకు వెళ్ళగా తెరలేస్తుంది. వెంకటప్పయ్య-సత్తారు సాయిబు కూర్చొని వుంటారు.)

వెంక :- ఎవడువాడు? అఫ్జూల్ ఎవడు? చెప్పు——డొక్క చీల్చి డోలు కట్టిస్తాను.

సత్తా :- హాయ్నా హెబ్రో హంకూ మాలుంనై హుండాది సర్కార్! హమారా గాంకావాలా హాయ్నా కాడూ వున్నాడ్ మహారాజ్!

వెంక :- ఆత డెలాగా నున్నాడో ఆనవాలు పట్టేవా?

సత్తా :- జీహాఁ—— జమీాందార్ వాలా హంటి జబర్దస్తీ—— గుబుల్ గుబుల్ హెత్తించే గొప్పా హందం, చందం.

వెంక :- ఆడపిల్లలాగా అంద చందాలు చెప్తా వేమయ్యా? (లోపలకుచూచి) నిరుద్యోగీ! నిరుద్యోగీ!

ముర :- వస్తున్నాను సార్! (వచ్చి నిలుచుండును.)

సత్తా :- (మురళీధర్ నుచూచి) హీయనే మరాజ్! హీయ్నే.

వెంక :- వీడా తలుపులు తీసింది? వింతగ నున్నదే——

సత్తా :- హింతానై-గంతానై హడ్డూ మహారాజ్ హడ్డూ!

వెంక:- ఏమోయ్! ఈ సాయిబుగారి కొట్టు తాళాలు తీసేవా?

ముర :- ఎస్సార్!

వెంక :- "ఎస్సార్"? ఎందుకు తీశావు?

ముర :- మన్నించాలి.

వెంక :- మదించిన వాడిని మన్నించడంకాదు—మర్ధించాలి.

సత్తా :- బాగా బోలీనాక్, సర్కార్! బాగా బోలీనార్! సైతాన్‌లాగా సమయానికి హొచ్చి—హత్తావారీషమ్మ హాల్లుడూ దానం పేసీనట్లు బస్తాల్ బస్తాల చావల్ బాజార్‌మే హేయించాడ్ మహరాజ్!

వెంక :- (మురళీధరునితో) మాటాడకుండా మానులా నిలుచున్నా వేం?

ముర :- మన్నించాలి.

వెంక :- మన్నించాలన్న మాటే మళ్ళీ చెప్తావేం? అడిగీ అడగకముందే అంగుళాల దూరంలో చెప్పాలి. అడుగులూ, గజాలు దూరమైతే ఆలస్యమై పోతుంది. చెప్పు - తలుపు లెందుకు తీశావ్?

ముర :- బియ్యం కోసం.

వెంక :- బియ్య మెందుకు?

ముర :- బీదల కోసం.

వెంక :- బీద లెందుకు?

ముర :- దేశం కోసం.

వెంక :- దేశ మెందుకు?

ముర :- ఓటు కోసం.

వెంక :- ఓటు కోసం? ఒచ్చే యెలక్షనుకేనా? ఓటుకావాలని వూళ్లోవాళ్ళ సొమ్ము పంచిపెడతావా? ఓటు సంపాదించు కొని వున్నవాళ్ళమీద పోటీ చేయాలనా? పరమ దరిద్రుడికిగూడా పదవీ వ్యామోహమే?

ముర :- ఊపిరి పోతూన్న బీదల చూచి వుద్రేకం పట్టలేక పోయానేకాని, పదవి కాసించి పదం పాడట మనేది మాత్రం నా హృదయ పరివర్తనలో నలుమూలలా కంచు కాగడాలు వేసి వెతికినా కానరాదండీ!

వెంక :- ఏం కూస్తున్నావురా-యిడియట్! సాయిబుగారూ! సందేహిస్తారేం? కాలి చెప్పువిడిసి కటిబిటీ రెండు వేసి మెట్లమీదినుంచి మెడబెట్టి నెట్టించండి.

సత్తా :- పట్టీ నెట్టించమన్న మాట పకడాగా హుండాదికాని, హా మాటా హంతా హతాౘ-లేద్ మహారాజ్! హాడా చావల్ ఖరాబ్ - హీడా చెప్పల్ కరాబ్. హెందూౘ-కావావాలా హంట సర్కాౘర్!

వెంక :- (మురళీధరునిచూచి) మెతుకుకోసం వచ్చిన మేధకువి అనుకొన్నాను కాని, నన్ను మింగటాని కొచ్చిన నాగుబాము వనుకోలేదు.

ముర :- అవును. మెతుకుకోసమే వచ్చాను. ఆ మెతుకు కోసమే పేగులు మాడిపోతున్న పేదవారి మెతుకులన్నీ గోతాలలో నింపుకొని గుప్తం చేసుకున్నాడీ సాయిబు___ "చౌక డిపోలు మావ"ని చాటి చెప్పుకొంటూ ఆకలి

గొన్నవారి నందరినీ అన్యాయంచేసి—దొంగ బజారులో
దోపిడీలు చేయమంటూ రాతిగుండెగల రాక్షసుడిలాగా
దయాహీనుని చేసిందా ధనాశా పిశాచం—ఆ అక్రమ
వ్యాపారంతో నీవూ అనుసరించి పోతావా?—చాటుగా
వాళ్ళిచ్చే డబ్బుకై చంక ఎగరేసు కొంటావా? కీలక
మెరిగిన వారిచేతిలో కీలుబొమ్మవా? — చెట్లపొదుల్లో
చేరిన చీడపురుగువా? కూలికి విషంతాగుతూ కూరుచున్న
నీకీ కపట నాటకాని కంతకూ కథానాయకుడివి కదూ?

వెంక :- హద్దుమీరి మాటాడితే హాని కలుగుతుంది.

ముర :- నాలుకలు చాచిన యీ నాగుబాము హద్దుమీరి
వొచ్చేక హాని కలిగే తీరుతుంది.

వెంక :- హాని కలిగిస్తే హతమారి పోతావు.

మురి :- నా హత మార్చటం నీ హయాంలో జరుగదు.

వెంక :- హయాం—"హయాం" అనే హక్కు నీకేముంది?

ముర:- హక్కు—ఏమిటా హక్కు?—ఎక్కడిదా హక్కు?—
హక్కు దేశానిది— హక్కు ప్రజలిది— హక్కు ఓటుది.
ఆ వోటు అమూల్య మైంది — అధికారరూప మైంది—
అమాయకపు ప్రజలను ఆశా సముద్రంలో దింపింది —
చుక్కాని లేని గుడ్డిపడవలో యెక్కించి సుడిగుండంలో ముం
చింది— విందు పెడతానని విషం పెట్టింది— రాజనుకో
దగ్గ నిన్ను రాక్షసునిగా మార్చింది— నీలాంటి తిండి
దొంగ, లంచగొండిని పదవి చూపించి పశుప్రాయునిగా
చేసింది—మహానీయులైన మంత్రి వర్గానికీ, పరమ పవిత్ర

న భారత పాలనకూ తీరని కళంకం తెచ్చి పెట్టింది.

— నోర్ మూయ్! దారిన బోయేవాడిని దగ్గరకు తీసి
దుకు—కన్న బిడ్డలా కనికరించి చూచి నందుకు —
ంకీపాటి బహుకారం మరీ మరీ జరుగాలిసిందె. విశ్వాస
ంతకుడా! నన్నే నిధిలో పెట్టి చూస్తున్నావ్?

— నేను విశ్వాస ఘాతకుడనైతే నేనే చెడిపోతాను.
ని—నీవు విశ్వాస ఘాతకుడవైతే నీవే కాకుండా
లుగు వారికే తలవంపు తెస్తుంది. ప్రజల కష్టాలు—
శయరూపం పొందుతాయి—

— నీ విప్పు డెవరిముందు నిలిచి మాటాడు తున్నావో
లుసా?

. తెలియక పోవటమేం? తెలిసే మాటాడుతున్నాను.
పకారం చేస్తానని, అపకారం చేస్తూన్న కసాయివాని
గ ముందర — ఓటిచ్చి వృక్షస్థాన మొసగిన వారికే
ధలు తెచ్చి పెట్టే బ్రహ్మరాక్షసి మొనట—అన్నం
రాపించి సున్నం పెట్టించే మహాపాతక రాజేంద్రుని
హాలు లోపల నిలిచి మాటాడు తున్నాను — నిజం
ంటాడుతున్నాను—నిర్భయంగా మాటాడుతున్నాను.

— మహా మహా కొమ్ములు తిరిగినవాళ్లే మాటాడలేక
యారు—అధికారా లున్నవారే అణిగి పోతున్నారు.
త్తిమీద జుట్టులేని నీవా నా ఎదుట నిలిచి మాటాడ
ంచేది?—నేనంటే......

ముర :- నీవంటే యెవరవయిందీ నే నెరుగుదును. నీ స్వార్థానికై నీ సాటివారిని నిలువునా గొంతులు కోసే నీచ బుద్ధివి — కలిమిని చూచుకొని కళ్లు నెత్తికెక్కిన గర్వపోతువి — పదవి పైకాలనే ప్రధానంగా తలంచి పాపపుణ్యా లెంచని పరమ దుర్మార్గుడివి — గొప్పవారింట బుట్టిన క్షుద్ర జంతువివి — ఇంతట చాలా? ఇంకా చెప్పాలా?

వెంక :- (కోపంతో) షటాప్ నోర్!

ముర :- నోరుమూసుకొని కూచోవలసింది మాటికి మాటు వాళ్లా నేను కాను. చదువుకున్నానని చాటుకొనే నీవు — స్థానం దొరికిందని సంబరాలుపడే నీవు మనసు మార్చు కుంటే మన కందరకూ మంచిరోజు లొస్తాయి.

వెంక :- మనసు మార్చుకోటానికి మా లోప మేంటి?

ముర :- ఇంకా ఏం కావాలి? యిదంతా ఏమిటి? ఎలక్షను నాటి మాటలివు డేమయాయి? ఓట్లనాటి ప్రచార గుణం పాలించేనా డెక్కడ పాడయి పోయింది?

వెంక :- మాటలు సరిగా రానియకపోతే నువ్వు మాత్రము పోతావు. ఊరికే వాగావో — ఊపిరి తీసేస్తాను.

ముర :- ఊపిరి తీస్తూంటే భయపడటానికి నిరుద్యోగి అంత నిరాధారుడు కాడు.

వెంక :- షటప్.

సత్తా :- షటప్పే గెటప్ చెప్పండి! పంపదాం అందర్నూ-?

వెంక :- యూస్‌లెస్ ఫెలో. వూరికే పోనిస్తానా?

ముర :- నీవన్నమాటే తిరిగి నేనూ అనగలను.

వెంక :- అంటావ్? అంటె—చెంపదెబ్బ తింటావ్ (చెంపన కొట్టును.)

మంజు :- (గబగబావచ్చి) నిరుద్యోగీ! నెప్పి తగిలిందా?

లలి :- (వచ్చి) నిరుద్యోగికంటే ముందు నెప్పి నీకే తగిలినట్లుంది?

మంజు :- నిజం మాటాడేవారిని నిష్కారణంగా కొట్టినపుడు నా కొక్కదానికేమిటి? — న్యాయం తెలిసిన ప్రతివారికీ నెప్పి తగలటంకాదు— నెత్తురు వేడెక్కి పోతూంది.

వెంక :- వాడిజబ్బు నీకూ వచ్చినట్లుందే?— పెళ్ళి కావలసిన పిల్లవు, పెద్ద లాఠ్డులా వచ్చావు. మేనత్తకొడుకా? మేన మామ కొడుకా? సిగ్గూ శరాలు లేకుండా సిద్ధపడితే సరి—ఛీ!

మంజు :- మన్నించాలి నాన్నగారూ! మాయమ్మ పోయిన నాటనుండి మమకారంతో పెంచారు — కూతురుపై నెంతైనా కూర్మి చూపించారు — కన్నతల్లిని మరిపించిన కరుణామయులు — అడిగినదాని కెప్పుడూ అడ్డుచెప్పినవారు కారు. నిరుద్యోగిని నేను నిశ్చలంగా ప్రేమిస్తున్నాను. ఎన్నడూ తొందర బడనివా డెందుకో తొందర బడ్డాడు. తప్పే చేశాడనుకొని తమరు మన్నించండి. మా యిద్దరికీ పెళ్ళిచేసి మాకో దారి చూపండి.

వెంక :- ఏమీ యెరుగనిదానిలావుండి యెంత తెంపుచేశావే మంజూ! పిన్ననాటనుండీ పెంచి పెద్దదానిని చేసినవాడిని, పెళ్ళి చేయక — పేరంటం చేయక తప్పించు కొంటాననా తయారయ్యావు? తల్లిలేనిపిల్లని తగిన సంబంధ మివ్వ కుండా — మూడు కానులులేని ముష్టివాడి కంటగడితే ముందువాళ్లు, వెనుకవాళ్లు ముఖ్యంగా నన్ననరూ?

మంజు :- పరాయివాళ్ళనూట పాటించడమేగాని, కాపరం చేసేవారి మనసులు కనిబెట్ట నక్కరలేదా నాన్నా?

వెంక :- మనసులు కనిబెట్టగల మాత్రపుదాన వయ్యావేం? పెళ్ళి నిర్ణయానికి పెద్దవు నీవేనా? మల్లె మొగ్గలా నిన్నింతకాలం మమకారంతో పెంచి పుల్లి పూవునిలాగా పూక్చి పారేయ మంటావా? (మురళీధరునితో) ఏయ్! పాలుద్రావి పెరిగిన పాముపిల్ల! వేగంవెళ్లు. మా యింటి ముందు నీ మొఖం మళ్ళీ చూపావో, మరియాద దక్కదని మంచిగా చెపుతున్నా — ఊఁ—

ముర :- ఆవులా కనుపిస్తూ అమాయకుల జీవితాలను పొట్టన బెట్టుకొనే పులిరాజునుచూచి పాలుద్రాగి పెరిగిన యీ పాముపిల్ల ధిక్కరిస్తుందికాని—దేబిరించదు. గుడ్ బై — (వెళ్లును.)

మంజు :- నీవూ తొందర పడుతున్నావా? నిరుద్యోగీ! నిలిచి మాట్లాడవూ? (అని రెండడుగులు వేయును.)

లలి :- నిరుద్యోగి తొందరబడితే— నీవు వెంటబడతావా?—

వెంక :— వయినంచెడ్డ కోతి వనమంతా చెరిచింది. మరికొన్నా ళ్లుంటే మాకొంపకే తిప్పలొచ్చేయేమొ?—అని విరగడచేసు కోని సాగనంపటమంటే కోడెత్రాచుకు కోరలు లాగినంత పనయింది. బుట్టలో పెట్టినాకగూడా బుసకొట్టుతూంటే—

లలి :— ప్రాణాలు తీయకుండా వదిలారు. పగపట్టుతుందేమొ—

సుంద :— (యస్.ఐ.—వేషంతో వచ్చి కూర్చుంటూ) పగపట్టిన వాడిని సిగ పట్టుకొందాం. శిక్షలో పెడదాం.

వెంక :— ఓ.— నీవా సుందరం! ఉద్యోగం సంపాదించేవా?

సుంద:— మరేమనుకున్నారు మామగారూ! ఛాన్సు వచ్చేసింది చార్జి పుచ్చుకొన్నాను. పెళ్ళిలగ్నాలు పెట్టుకొందామా?

వెంక :— రాజమండ్రివాళ్లు కూడా రాయబార మంపించారు. మంజును నీకిచ్చే మాట మళ్ళీమళ్ళీ చెప్పాడ మెందుకు ? ముహూర్తాలుపెట్టి ముగించేద్దాం.

మంజు :— సుందరాన్ని చేసు కొంటం నాకు నూది మొనం తయినా యిష్టం లేదంటే లేదునాన్నా!

లలి:— మంజూ! నిరుద్యోగి నెమ్మతిగలవాడే గదానని పోని య్యి లెమ్మంటూ పొదిపి పెట్టుకొన్నాం. మన నాన్నగారి నలా మాటాడక మనసయినా మార్చుకోనద్దూ?

సత్తా:— నిరుద్యోగిగాణ్ణి నికా కట్టుకుంటే కుచ్‌కుచ్ గా నైనా మీాకీ కుషాల్ నైహై హుండాది హమ్మాయివారూ?

సుంద:— ఏమిా? నిరుద్యోగా— నిజమైనపేరా? మాయ ముండా కొడుకులు పెట్టుకొన్న మారు పేరా?

లలి:— ఎవడో, ఎంగిలి మెతుకులకోసం నచ్చిన వెధవ— పేరు

దాచుకొన్న పెద్దమనిషి—

మంజు:- నిరుద్యోగి నంత నీచంగా చూడొద్దు. కారణాలచేత కట్టుబడినటులుంది కాని—చేతగాని మనింటిజీతగాడు కాదు.

సుంద:- అయితే అదేమటో అంతు తేల్చుకో వలసిందే—

మంజు:- నిరుద్యోగిని తెలుసుకొంటం నీ తరమైన పని కాదు.

సుంద:- అదెంత నిజమో ఆచరించి చూపిస్తాను. పట్టు పట్టా నంటే పంతం నెగ్గించి తీరుతాను. యస్. ఐ - సుందరరా వంటే, యేమను కొంటున్నావో—

వెంక:- భేష్—భేష్.

సుంద:- నిరుద్యోగినీ మంజు నిశ్చిన్నగా చేసుకోవాలనేనా?

ముంతా:—(వచ్చి) అంతేలేండి.

వేంక:- ఛా! నోరు మూసుకో.

ముంతా:- అంతేలేండి.

వెంక:- సాయిబుగారూ! సమయంచూచి—నలుగురిని తీసుకెళ్ళి నలగబొడిచేయండి - నిరుద్యోగి చేదేమిటో నేనుచూస్తా.

సత్తా:- సుందరారావ్గారూ వారూ మాకీ సూస్కాంటూహులంటే లడాయికీ మనం తయార్ సర్కార్!

సుంద:- అనుమానించడానికి అదెంతపని? మంజూ దేవిగారి మాటల పస—నిరుద్యోగిగారి నివాట్టు, ఇక ఆడించమా?

సత్తా:- హుకుందేవ్ సర్కార్! హరోకా రాతిరీమే మనం తల్చాకొంటే మర్గయా హైపోతాడు. మహారాజ్.

వెంక :- అనుకొన్నపని అతిజాగ్రత్తగా చేయాలి.

సత్తా:- అచ్ఛాజీ! ( తెర )

# నిరుద్యోగి

( ఏడో రంగం )

[సాయంకాలం-నాలుగుబజారుల కూడలి: రామయ్య రంగనాథం, శేషాచలం, కోటంరాజు — కూర్చొని వుంటారు. తెరలేస్తుంది.]

రామయ్య :- ఆయన యెవరయిందీ అర్థం కాలేదుగదా?

కోటం :- మనకు బియ్యమిప్పించి నపుడే మంచీ చెడ్డా తెల్సుకోవలిసింది.

రంగ :- అపు డూరుకున్నామని యిపు డూరుకుంటె యెలా?

కోటం :- ఎరుగుదునని యేకంగా చెప్పలేనుకాని - యెత్తాని కెక్కడనో చూచిన మొగంలాగానే వుంది.

శేషా :- మనూరి మనిషి కాకుంటే మనమీదింత అభిమానముంటుందా?

కోటం :- మనూరు కాకపోయినా మన పొరుగూరి వాడైనా అయి వుంటాడు.

రంగ :- ఊరేదయినా వుత్తముడులా వున్నాడు.

రామ :- చదువు కొన్నవాడు—చాలినవాడున్నూ.

కోటం :- సమర్థుడు కాబట్టే సాహసించ గలిగాడు.

రంగ :- ఈసారి యెలక్షనులో యీాయనన్నా నిలుచుంటే బాగుండు.

రామ :- తనకై తాను నిలుచుండకపోతే తప్పకుండా మనమే నిలవబెడదాము.

రంగ :- పల్లెలలో వోట్లన్నీ పదిలంచేస్తే నిలవబెట్టిన వాడ్ని గెలిపించి తీరుతాం.

శేషా :- ఇండియా మైదానంలో యేదో మీటింగన్నారు.

రాను :- ఇదంతా యెంకటప్పయ్యయేనా? ఓటడగటానికేమ యినా ఓకేస్తున్నాడేమొ — యీసారాయన యింట్లో కూర్చో వలసిందె—

కోటం :- కాకపోతే మరీ అంత కసాయి తనమా? క్రూర సేనుని పాలనకన్నా ఘోరంగా వుంటే—

రామ :- అనవసరమైనదాని కాలోచనెందుకు? ఇందాక మన మనుకొన్నాయన యిప్పు డెక్కడుంటాడో? ప్రయత్నించి తెలుసుకుంటే ఫలముంది.

కోటం :- మనరోజులు మంచివయితే మన దగ్గరి కాయనే నడి చొస్తాడు.

మురళీధరుడు :- (వచ్చి) అయ్యా! రేయి పండుకొని రేపెళ్ళి పోతాను. చోటింత వుంటె చూపిస్తారా బాబూ!

రామ :- ఏ వూరు మీది?

ముర :- ఫలానావూరని చెప్పుకోదగ్గ పరిస్థితిలో లేనుబాబూ!

రామ :- ఎక్కడికి పోతున్నావు?

ముర :- ఏ పనైనా వుంటేగదా? యెక్కడికైనా పోవడానికి—

రామ :— ఎవరివినీవు? ఏమిటి నీకథ?

మురా :— ఎవరినని చెప్పకోవాలో యేమీ తోచటం లేదు. చెప్పవలయునంటే నాకథ చిన్నది కనుకనా బాబూ!

రంగ :— చిన్నకథ కాదు లెమ్మంటూ చెప్పి తప్పకొంటున్నావు—కూనీలు చేసొచ్చేవా కొంపలు దోచొచ్చేవా ?

మురా :— కొంపలు దోయలేదుకాని—కొట్టుతాళాలు తీశాను.

శేషా :— తాళాలు తీయటంలో తరిఫీదు పొందావన్నమాట?

మురా :— పదిమందిలో పట్టపగలు తాళం చెవులతో తలుపులు తీయటంకూడా తప్పేనని తమరంటారా?

కోటం :— అందుకు, అవసరం?

మురా :— ఆహార ధాన్యంలేక— అన్నంగోన్నవారి ముఖాలు చూడలేక—

రామ :— బియ్యపు కొట్టువారితో బెడద పెట్టుకొన్నావా?

మురా :— అందుచేతనేకథ యిందాక వచ్చింది.

కోటం :— ఈపని జరిగి యెన్నాళ్ళయింది?

మురా :— ఎన్నాళ్లో యెక్కడిదండీ! ఈరోజు మధ్యాహ్నమే—

రామ :— ఆఁ— మీరా? మధ్యాహ్నం మాకు బియ్యమిప్పించింది? కనుమసక చీకటిలో కనిపెట్టలేక పోయామండీ! మందబుద్ధులం—మన్నించాలి బాబూ!

రంగ :— ఎవరోననుకొని యిన్నిమాటలన్నాం. కోపబడక మమ్మల్ని కాపాడాల బాబూ!

శేషా :- మీరిలా వస్తారని మే మెలా అనుకోంటాం చెప్పండి.

మురః :- నా స్నేహితులు మీరేనని నాకుమాత్ర మెలా తెలియటం చెప్పండి.

కోటం :- పేరేదిమో సెలవిస్తే, పిలుచుకునే వీలుంటుంది బాబూ!

ముర :- నాపేరిక్కడ నిరుద్యోగని నలువురూ పిలుస్తున్నారు.

రామ :- నిరుద్యోగిగారూ! మీ నివాస మెక్కడనండీ?

ముర :- నెత్తిపైన నీడలేని నాకు నివాసమంటూ వుందా నాయనా!

రంగ :- నిరుద్యోగిగారూ! నిజమైన మీ సంగతి పూసగ్రుచ్చి నట్లు పూర్తిగా చెప్పరూ?

ముర :- బాధలు పడుతూన్న భాగ్యవంతుల బిడ్డను—ఎ, బి, సి. డీలు రానటులున్న ఎఫ్, ఎ- పట్టభద్రుడ్ని— అధమ స్తంగా కనిపిస్తున్న అభిమాన జీవిని. ఇంతకంటె యేమి చెప్పాలన్నా మనసేమీ బాగులేదు— మరో విధంగా తలంచకండి.

రామ :- మరో విధంగా మీ రనుకోకుంటే మాటొకటి చెప్పాలనుకొన్నామండి.

ముర :- మాట చెప్పుతామంటే, మరలిపోతానా? చెప్పండి.

రామ :- మాతోబాటు మీరు మావూళ్లో కొన్నాళ్లుండాలి.

ముర :- కొన్నాళ్లేమిటి?— ఎన్నాళ్ళయినా వుంటాను.

రంగ :- ఊరకే వుండటంకాదు. ఒచ్చే ఎలక్షనులో మీరు అభ్యర్థిగా నిలుచుండాలని మేమంతా కోరుతున్నాం.

ముర :- నా పేరుతో నామినేషన్......

రామ :- దాఖలు చేయటానికి దడుపేమిటండీ? నామ మాత్రంగా మీరు నిలుచున్నానంటె— నడవ వలసిన దంతా మేం నడిపిస్తాం.

కోటం :- మీరు "సరే" ననండి—మేము ఫీజు కట్టేస్తాం.

ముర :- చూద్దాం.

రామ :- చూద్దాం కాదు— చేద్దాం.

మంజు :- (మగవేషంతోవచ్చి) చేద్దాం కాదు-చేసి తీరుదాం.

రామ :- (పరకాయించిచూచి) ఈ క్రొత్తమనిషి ఎవరై వుండాలి?

ముర :- ఎవరవు నీవు?

మంజు :- నీ మనిషినె—

ముర :- నాకు తెలియని మనిషివి నా మనిషివా?

మంజు :- తెలిసిన మనిషినె— తెలియకుండా వచ్చాను.

ముర :- తలవనితలంపుగా యీ ఘట్టం తమాషాగా వుందె?-

మంజు :- తలిమీాది కొచ్చేక తమాషా వేషం తయారుచేయక తప్పలేదు.

ముర :- నీ తలమీాదికా? నా తలమీాదికా?

మంజు :- నీ తలమీది కొచ్చినదానిని కొంత నా తలమీదా పెట్టుకొన్నాను.

ముర :- నీ తలమీద పెట్టుకొనే పని నీ కెందు కొచ్చింది?

మంజు :- నిన్ని యాపదనుండి రక్షించాలన్న నిశ్చితాభిప్రాయం చేతనే.

ముర :- నీకీ యభిప్రాయం కలగటానికి నిజమైన కారణం?

మంజు :- చెబుతూనే వున్నానుగా?—"చెలిమి కోరాననీ"-

రామ :- ఏయ్! కొత్తమనిషీ! కూర్చో. "ఆపద"న్నావే?— అదేమిటో చెప్పు.

మంజు:- నీయుద్యోగిని చంపడానికి నిశ్చయించు కొన్నారు— మంత్రి వెంకటప్పయ్యగారు మద్ధత్తు చేయమంటున్నారు- సుందరం వాళ్ళను ప్రోత్సహిస్తున్నాడు.

ముర :- (ఆశ్చర్యముగ) సుందరం? సుందరం, అంటె ఎవరు?

మంజు :- మా బంధువే— అంటె మా బావన్నమాట—

రంగ :- మీ బావంటె?— మీ తోబుట్టువు నిచ్చేరా?

మంజు :- నా తోబుట్టువు నివ్వటంకాదు — నన్నే చేసుకుంటానని అంటున్నాడు.

రామ :- నీకేమైనా పిచ్చెత్తిందా? నిన్నెలా చేసుకొంటానన్నాడు?

రంగ :- మగవాళ్ళను మగవాళ్ళం చేసుకొంటం మన హయాంలో యిదోమార్పు కామోలు. (అందరునవ్వుదురు)

మంజు:- మగవాడి నెందుకయింది? మగువనే— పగవాళ్లకు చిక్కకుండా పన్నిన తతంగం యిది. (తలగుడ్డదియును.)

ముర :- మంజూ! నీవా? మంచి సాహసం చేశావే?

మంజు :- నిరుద్యోగి కోసమై నేనే సాహసమైనా చేస్తాను.

ముర:- ప్రమాందంలో నీవుకూడా పాలు పంచుకొంటావేమో?

మంజు :- ప్రమాదం వచ్చినా, ప్రాణాలు పోయినా— మంజు మతంలో మారుమతం రాదు.

ముర :- కావలసిన కార్యక్రమం?

మంజు :- కన్నుదగిలే పుల్లను కనిబెట్టి తిరగడమె.

రామ :- పనిలేదు- పల్లెలన్నింటిని కలుపుకొని, కత్తికి కత్తి కట్టుదాం.

ముర :- ఇంట్లో తెలియకుండా యెలా వచ్చావు మంజూ!

మంజు :- "మీటింగ్ ప్రోగ్రాం" అంటూ మా నాన్న మోటారు యెక్కి పోయారు - అక్కయి స్నేహితురాలింటికి "అవసరమం"టూ పోయింది— నేనీ వేషం వేసుకొని నీ వెంటబడ్డాను. అట్టె శ్రమబడకుండా యిట్టె దొరికేవు.

ముర :- నిరుద్యోగిని నీవు పట్టుకొనేలోపల నీవు పట్టుబడినట్లైతే కళ్లు తేలేసి కాళ్లారజాపాలి సొచ్చేది.

మంజు :- పవిత్ర పరివర్తన పరులచేతికి చిక్కుతుందా?

ముర :- పవిత్ర హృదయానికే పరీక్షలు మెండు మంజూ!

మంజు :- పరీక్షలో నెగ్గుతాను కాని— పడిపోను కదా?

ముర :- తిరిగి మీవాళ్ళొచ్చేసరికి నీవు కనబడకపోతే— "చెప్పకుండా పోయిందం"ని స్టేట్‌మెంట్ యివ్వరుకదా?

మంజు :- ఇవ్వకుండా యెందుకుంటారు? ఇచ్చేమాటే నిజం.

ముర :- ఇచ్చేమాటే నిజమైతే— యేమిటీ చేయటం?

మంజు :- మగవేషంతోనె కొన్నాళ్లు మరుగున నుండేదాని కన్నా మరో మార్గం మనకేముంది?

రామ :- మీకే యిబ్బందీ రాకుండా మేము చూస్తాం. ఎక్కడికీ పోకుండా యిక్కడనే వుండండి.

ముర :- ఈచోటే మనకు యెంతయినా జయం.

( తెర )

# నిరుద్యోగి

## ( ఎనిమిదో రంగం )

[ నారాయణరావుగారిల్లు; హరిబాబు ]

హరిబాబు:- బాబాయ్! బాబాయ్!

సరళ:- (లోపలనుండి) బావా! బావా! (అంటూ వస్తుంది)

హరి:- మా బాబాయిగా రింటిలో లేరా?

సర:- మీ బాబాయిగారు గోయింగ్—మా బావగారు కమింగ్.

హరి:- మాట లీపూట మరింత జోరుగా వస్తున్నాయి?

సర:- మా బావగారు నేరుగా వస్తున్నారని—మాటలు మరింత జోరుగా వస్తున్నాయ్.

హరి:- నేరుగా వచ్చింది నీకోసం కాదు సరళా!

సర:- నాకోసం కాదని నాకూ తెలుసు.

హరి:- తెలిసిన వాళ్ళ ధీరీ యిదేనా?

సర:- తెలియని వాళ్ళకు తెలియ చెప్పడమేగా?

హరి:- ఏమని?

సర:- ఇలా రమ్మని— యీ కుర్చీలో కూర్చోమని — నన్ను పెళ్ళి చేసుకోని, నా యాస్తికూడా అనుభవించి ఆనందించమని—

హరి:- ఇది తమ్ముడి వంతని యిదివరకే చెప్పాను.

సర:- "తమ్ముడికి భాగ్యం తలరాయలేదని—అందు చేత అన్నగారినే అన్ని భాగ్యాల ననుభవించమ"ని - యిరుగు పొరుగు వారుకూడా యేక కంఠంగా చెప్పుతున్నారు.

హరి:- చెప్పినంత సులభంగా చేయలేము సరళా!

సర:- చిత్తంలో వుంటే చేయలేకేం బావా?

హరి:- ఆలోచనలేని పని ఆపదల పాలవుతూంది సుమా!

సర :- ఆలోచించుకొన్నాకనే అవలంబింప వచ్చునుకదా?

హరి :- ఆలోచించటానికి అవకాశ ముండొద్దూ?

సర :- అవకాశానికి అంతులేదా బావా?

హరి :- అంతులేదా అనుకొంటానికి అంతమయిం దేముంది?

సర :- అంతమయేక చేసేది అలుసంతయినా వుంటుందా?

హరి :- అవూ టనుకొనేగా అను క్షణమందూ తమ్ముడు జాడకై తహతహలాడు తున్నాను.

సర :- తమ్ముడని మీకున్న తాపత్రయం— అన్నగారియం దాయన కావగింజంతైనా వుందా? యిన్నాళ్ళయిందికదా యింటివైపుకు కార్డయినారాసి కబురంపేడా?

హరి:- కారణాంతరాల చేతనే కార్డయినా వ్రాయలేకపోయి వుంటాడు. అదేదీ కాకపోతే అసలు వాడే వస్తాడేమో— మురళీధర్ అంటే మోసగాడను కొన్నావా?

సర :- బావా! మురళీధర్ బావ మోసగాడని నే ననలేదు— మూర్ఖుడనీ నే ననలేదు. ముందుగా మిమ్ము నేను చూచా

ను— మునుపటికి మిమ్మే ప్రేమించాను— మురళీధర్ బావ ముందో నాటికి రావొచ్చు. సంతోషంగా సమ భాగ మివ్వండి— నారాయణరావు మామగారి యాస్తి తో బాటు నా యాస్తికూడా కావాలంటే కానీలతో యిస్తాను. కాని— నన్నాతనికి మాత్రం కట్టి పెట్టకండి బావా! (అంటూ చెయ్యి పట్టుకొనును.)

హరి:- (నిస్పృహతో) మంచి చిక్కులో నన్ను ముంచేశావే- సరళా! (కూర్చొనును.)

సర :- గుక్కెడు వేడి కాఫీతో గొంతు తడుపుకో బావా! చిక్కుబడ్డ మనస్సుకు స్థిమితం చేకూరితే సాఫీయాలోచన సాగివస్తుంది. (రెండుకప్పుల కాఫీ బల్లమీద పెట్టును.)

హరి :- కడుపులో యేమీ బాగులేదు— కావాలంటే నీవు తాగు సరళా!

సర :- నేనుతాగే సంగతి నీవు చెప్పాలా బావా! మీ కంత శ్రమగా వుంటే మెదలకుండా కూర్చొండి. నా చేతి మీదుగా కాఫీ నందిస్తాను-నాకోసమైనా తాగుదురు కాని. (అంటూ తిరగబోస్తుంది.)

హరి - (సరళ చేయిపట్టుకొని) నీకోసం కాఫీ నేను తాగటమా?

సర :- అవును— "నాకోసం" అంటే నా ఆనందంకోసం.

హరి :- అబలారత్నమిలా ఆనందాన్ని కోరినపుడు, మరింత శ్రమ బెట్టటం మరియాదకాదు. (సరళ చేతిలోని కప్పులు తీసుకొని కాఫీ తాగుచుండును.)

సర:- (సంతోషంగా అటూ యిటూ తిరుగుతూ) (సాంగ్)

కాఫీ తాగే బావా! కామిత మీవె కావా?
నా కామిత మీవె కావా? ||కాఫీ||

మగువలు మదికోరిన మమకారాలూ
మగవారలు దీర్చులె మంచి మరియాదలూ
మీ మరియాదలూ ||కాఫీ||

ఆకలివేళా అందినపండూ నారగింపరావేలా?
చీకటినుండీ వెన్నెలసీమా చేరవేగ రావేలా?

నవయవ్వనములో నాట్యమాడు నా భావాలోయి;
యివిగో- యివిగో- గైకోవోయి- జాగేలనోయి?

(అంటూ చేయిపట్టుకొని పూతోటలోనికి తీసుకుపోతుంది.
యిద్దరూ కలిసి పాడుదురు.)

హరి :- హాయిగా మనో నాయకీ! హాయిగా...

సర :- హాయిగా మనో నాయకా! హాయిగా...

హరి :- మనసూ, మనసూ ఒకటైఐతే

సర :- మన యిద్దరమూ ఒకటైఐతే

హరి :- వలపులు కులికే - తలపులు జెలగే
చిలుకలు పలికే - పలుకులె కలిసే ||హాయి||

సర :- కోయిలజంటా- కుహూ కుహూలంట
తీయనిహాయి - కోరిక మీర ||హాయి||

హరి :- ఆఁ—?

సర :- ఊఁ—!

హరి :- 'ఆ'అన్నా- 'ఊ'అన్నా- అతికిందే మన మనసూ;

సర :- నీ మాటా, నా మాటా— నేటినుండి వొకే బాట!

(పాడుతూ పార్కులోని అరుగుమీద కూర్చుందురు.)

నారాయణరావు :- (వచ్చి మరో అరుగుమీద కూర్చుంటూ) హరీ! నీ విక్కడ నున్నావురా! నీకోసం యింటికి కబురు చేశాను.

హరి :- (ఉలిక్కిపడిలేచి) లేదు బాబాయ్!

నారా :- "లేదు బాబాయ్" అంటూ లేచి నిలుచున్నా వేమోయ్! కూర్చున్నవాడివి కూర్చోకుండా-

హరి :- ఆఫీసుపని కొంచెం అర్జంటుగావుంది. పోవాలంటూ నేను పోబోతుంటే— కాఫీతాగేదాకా సరళ కదలనీయ లేదు బాబాయ్!

రత్తం :- చిత్తం. (అంటూవచ్చి) అమ్మాయిగారి చేతిలో అబ్బాయిగారు బొమ్మలా చిక్కిపోయి బొంగరంలా తిరుగుతోన్నారండీ!

సర :- (కోపంగా) రత్తం—

రత్తం :- చిత్తం.

నారా :- ఆఫీసు పనంతా అవకాశాన్ని బట్టి వుంటుందోయ్! మానేస్తే మళ్ళబడదు— చేస్తూంటే చెయ్యోదిలి పోదు.

కొత్త బారిష్టరవు కాబోలు_ కోర్టు పరిచయం కలిగిందా?

హరి :_ కోర్టుపరిచయం కొంచెమేంటి? కుడిభుజంలా విజయం కూడొస్తుంది బాబాయ్! కూడొస్తూంది.

నారా:_ బాబాయికి బ్రహ్మానందమైనవార్త చెవుల విందుగా వినిపించావు. హాయిగావుందిరా హరిబాబూ!

హరి :_ పిలిపించిన మాటేమిటో వినిపించేరు కారు?

నారా:_ అభివృద్ధి యెలావుందో అడుగుదామని పిలిపించాను. మళ్ళీ అడగకుండా మాటలలోనే తేలిపోయింది. కొడుకు మంచితనానికి కోడలును ప్రజంటు చేద్దామని సరళాదేవిని సన్నాహ పరిచాను.

రత్తం :_ చిత్తం. చిత్తం___అబ్బాయిగారి అదృష్టరేఖ కాలిని చుట్టుకొని కలిసొస్తుందిబాబూ! కొత్తగావచ్చిన బారిష్టరు పని ___ కొత్తగావచ్చే భార్యామణి. మంచి రోజుల్లో మనిషే దేవుడు బాబూ!

హరి :_ దూసుడుపడి మాటలూరక దొర్లిస్తారేందుకు? తమ్ముడింటికి రావాలి___ తలపెట్టిన కార్యాలు కావాలి.

నారా :_ (కోపంతో) వాడి పేరెత్తితే నా వళ్లు వేడెక్కిపోతుంది. మాట నిలుపుకోలేని మాదర్చోద్___ విశ్వాసం లేని వెంగళప్ప.

హరి :_ తెలియక వాడు తొందరబడితే తెలిసి మీరూ తొందరపడాలా? రక్తస్పర్శ గలవాడు రాకున్న సమయంలో పెళ్ళి చేసుకొంటమంటె పెద్ద కొరతగా వుంది.

నారా :- ఇదుగో హరీ! ఎన్నాళ్ళీలా యీడువచ్చిన పిల్లను యింట్లో బెట్టుకొమ్మంటావురా! సరళను చేసుకొంటం సమ్మతం లేకపోతే నీ తమ్ముడులాగా నీవూ తేల్చిచెప్పు. (విచారంగా) ఆ! దానిగీతింతకూ దరిద్రపుగీత కాకపోతే- తల్లి తండ్రులను కరువై తాత ముత్తవులింట పరాయి పిల్లలా పడుంటుందా? (కంటతడిబెట్టుకొని) మా బావ మరిది చచ్చిపోతూ మరీ మరీ చెప్పాడు. నేనూ, "మా అన్నయ్యగా రబ్బాయికే యిచ్చి చేసుకుంటాను, సరళ మాకళ్ళయెదుటె సలక్షణంగా వుంటుంద"ని. బావమరిది కిచ్చిన మాటకై బాధపడుచున్నాను కాని——

హరి :- ఏమన్నానని బాబాయ్! యింత బాధ పడతారు?

నారా :- ఇంకా యేమనాలరా? ఇది చాలదూ? లక్ష రూపాయలొచ్చే లక్షణమైన సంబంధం——పరువూ, మరి యీడగల పాత చుట్టరికం—— పిలిచి పిల్లనిస్తామంటె...

హరి :- కాదనలేదు బాబాయ్! కావాలంటున్నాను. మురళీ ధరుడుకూడానస్తే బాగుండునని ముచ్చట బడుతున్నాను. అంతె —— ఉన్న చోటైనా తెలిస్తే వోమాటు వెళ్లైనా వద్దును. జాబూ లేదాయె—— జవాబూ లేదాయె.

[తెరలో] హరిబాబుగార్కి- పరసనల్ లెటరండీ!

నారా :- ఆ ఉత్తరం, అందుకో రత్తం.

రత్తం :- చిత్తం. (కవరుతెచ్చిచ్చి) చినబాబుగారు రాశా రేమొ—— చింపి చూడండి బాబూ!

హరి :- (చదివి) చినబాబు, చీటీరాయటం కూడానా?

సర :- ఈ యుత్తరం యెక్కడిది బావా?

హరి :- విజయవాడవారట—వేంకటప్పయ్యగారట. ఎవరో-

నారా :- ఎవరో యెందుకయింది? మీకుత్త్రాళ్ళకు తెలీదు కాని— మినిష్టరు వెంకటప్పయ్యగారంటే లాభిస్తున్న లక్షాధికారి. అంత దగ్గిరవాడు కాకపోయినా అసలు కలిసినవాడే.

రత్తం :- చిత్తం. చినబాబుగారు అక్కడికేమైనా చేరారా బాబూ!

హరి :- అలాగా అయితే అదృష్టవంతులమె.

నారా :- అదృష్టమోవంక ముదనష్ట మాతూంటె—"అదృష్ట మం"టావేమిట్రా?

రత్తం :- చిత్తం. ఉత్తరంలో వున్నదేంటి బాబూ!

హరి :- పార్టీ వైపున పనిచేయటానికి- బాబాయ్! తమ్ముడి నెలాఖరునైనా తప్పకుండా రావొచ్చు. విజయవాడ వెళ్ళి వేగం వచ్చేస్తాను. మరో పిల్లనుకూడా మాటాడండి బాబాయ్! మురళీధర్ పెళ్ళికూడా ముగించేసేద్దాం.

నారా :- నా పరువుకాస్తా నట్టేట పెట్టాలనా? వాడికి పిల్లను మాటాడేవంతు నాకు పెట్టావు— పిల్లగలవాళ్ళెవరైనా, అల్లుణ్ణి చూట్టానికొస్తె, నాలిక వెళ్ళబెట్టి నన్నే చూడమనాలి సాస్తుంది.

రత్తం :- చిత్తం. అంతే బాబూ! (తెర)

# నిరుద్యోగి

## (తొమ్మిదో రంగం)

[ ఊరి వెలుపల మైదానం; మంజు - మురళీధరుడు. ]

మురళీధర్ :- మంజూ! మన మిఁకెంతకాల మీ మాయనాటక మాడాలో?

మంజు :- మంజు "మధు"లాగా నటించి మంచిరోజుల్లోకి పొయ్యేదాకా-

ముర :- మంచి రోజులు వచ్చే మహర్దశ మనకుందా?

మంజు :- మంత్రిపద వొచ్చేక మహర్దశ వచ్చితీరుతుంది.

ముర :- మనం గెలిస్తేగా మహర్దశే రావటం?

మంజు :- మంజు చెప్పిన మాటకు మార్పంటూ వుంటుందా?

[లోపల పిస్తోలు ప్రేలును.]

ముర :- అమ్మా! (అంటూ పడిపోవును.)

మంజు :- ఆఁ- పిస్తోలు ప్రేలుడా? (పడుస్తూ) అయ్యయ్యో, నిరుద్యోగీ ఆఖరుచూపాయిది? "నిన్నే పెళ్ళిచేసుకోవాలని— నీతోనే కష్టసుఖాలు పడాల" ని నిన్నే నమ్ముకొన్న నీ మంజుని యేంచేసి పోతున్నావు నిరుద్యోగీ! రాత్రిం బవల్లు కాపాడుకొని కూడా నిను రక్షించుకోలేక పోయానే— దగ్గరనే వుండికూడా నిను దక్కించుకోలేక పోయానే— మంజు కోరికలన్నీ మంట బడినట్లేనా?

నెచ్చెలి శ్రమలన్నీ నీటిపాలేనా? ఎక్కడ పుట్టావో?— యే యమ్మ గన్నదో?— యిక్కడకువచ్చి యీ మైదానంలో— దౌర్భాగ్యురాలి చేతులందు దిక్కుమాలిన చావుగా కాలగర్భాన కలిసిపోతున్నావా? ఏ ఘనకార్యం సాధించటానికి — ఎవరి నుద్ధరించటానికి — పూర్తి పేరులు దాచుకొని వోపికపట్టి తిరిగావు నిరుద్యోగీ! నీ నిర్ణయాన్ని యే కాస్తైనా నెరవేర్చావా నిరుద్యోగీ!— నిరుద్యోగీ! నేను, నేను మంజును— నాకోసమైనా నాలుగు కాలాలపాటు భగవంతుడు నిన్ను బ్రతికించలేక పోయాడా? ఆపదనుండి కాపాడు కొంటాని కొచ్చిన నీమంజు పైనబడిపడ్వటానికే పనికొచ్చిందా? నిరుద్యోగీ! చివరకింత చిరునవ్వుల నీ నోటి మాటకైనా నోచుకోక పోయానా?

మురః- (కన్నులు దెరిచి - చిన్న గొంతుతో) మంజూ!

మంజుః- (సంతోషంతో) మీరా! మాటాడుతున్నారా? కళ్లుతెరిచి మళ్ళీ నన్ను కనికరిస్తున్నారా?

మురః- కంగారు పడాలిసిన కారణమేమీ లేదు. గుండెకు పెట్టిన గురి తప్పిపోయింది. చేతికి తగిలిన దెబ్బంతగా చేటు చేయదు. చింతపెట్టుకొని మనసు చెడగొట్టుకోకు మంజూ!

సుందరంః- (సత్తారు సాయిబుతో వచ్చి) ఏయ్! మంజూ! ఎక్కడికి పోతావు? మాయ వేషాలతో మాకళ్లే మూయాలనా? సుడిగాలి దెబ్బలాంటి యీ సుందరందెబ్బ తప్పించుకొంటం నీ తాత తరమౌతుందా?

ముర :- సుందరం! నీవేనటరా! నే నెవరో ననుకొన్నాను.

సుంద :- ఓరి, నీవురా! మురళీధర్! నిరుద్యోగిపేరుతో నీ విక్కడ నున్నావా?

మంజు :- నిరుద్యోగిని నీవెరుగుదువా బావా? ముచ్చట లూరించే మురళీధర్ అనే పేరుకు ముదుపుగట్టి మూలన పెట్టేవా?

సత్తా :- ఝూటావాలా మీకీ జో స్త్రీవాలా? మహారాజ్!

సుంద :- (కోపంతెచ్చుకొని) లేదు సాయిబు గారూ! లేకి వెధవ— నాకు స్నేహితుడా? నయం— యింకా నా తమ్ముడి నన్నాడు కాదు.

ముర :- సుందరం! కాస్త నౌకరీ దొరకగానే కళ్లుమూసుకు పోయాయిరా?

సుంద :- పెచ్చుగా మాటాడితే పిస్తోలు మళ్ళీ ప్రేలుతుంది. దోవన బోయే దొంగ వెధవని, నీడ చూపించి నిలుచుండ మన్నందుకు—మర్యాదస్థుడైన మా మామగారి మానాభిమానాలు మట్టిపాలు చేసి— మాయలుచెప్పి మంజు నెత్తుక వచ్చి—యింకా "యేమిరా సుందరం!" అంటూ నన్నూ యెకసక్కె మాడుతున్నావురా ఫూల్!

ముర :- నౌకరీ వస్తేమాత్రం నడమంతర మెందుకురా? అరె— సుందరం! అధికారం చేతికొచ్చినప్పుడు అసలువిషయాన్ని మభ్యపరచి మాటాడుతావటరా!

సుంద :- సాయిబుగారూ! సందర్భ మర్థమైందా? కాలేజీలో

చదువుకొన్న క్లాస్‌మేట్ ఫ్రెండ్-మురళీధరుడనే ముఖ్యమైనవా డుండేవాడు. వాడే వీడని పరకాయించకుండా పలుకరించాను. చిక్కిన వంకను చేవదలకుండా నాకే నుస్కా కొట్టాలని యీ నాటక మాడుతున్నాడు. ఈ పక్షితో యెందుకులే—పోదాంరండి. మంజూ! నిన్నరెస్టు చేస్తున్నాను. నీవు మావెంట రావలయును.

ముర :- నిజమైన మురళీధర్‌ని నేనేరా సుందరం! మధ్య వచ్చిన మాయదారిని కాదు. నామాట నమ్మవటరా?

సుంద :- చెప్పు కోసిన నక్కలా చెడ వాగుతావేం? పాపం దలిచి నిన్ను ప్రాణాలతో వొదులుతున్నాను.

ముర :- మరణమే నాకిపుడు మంచిదిలాగుంది. భారతీయుడనని చెప్పుకోదగ్గవాడికిపుడు బ్రతుకెక్కడిదిరా? మనదేశ మిపుడు వెనుకటిదేశం కాదు—మన పెద్దలిపుడు వెనుకటి పెద్దలు కారు— కుట్రాలోచనలకు గొప్ప కోటలు— రాక్షసత్వానికి రాచబాటలు— మిత్ర ద్రోహానికి మిద్దె టిల్లు— అఘాయిత్యానికి... ...

సుంద :- నోర్ మూయ్! ఏమిటీవాగుడు? పిచ్చెక్కిందా? సాయిబుగారూ! సాగిపోదాంరండి. పిచ్చివాడితో పిచ్చిమాట లెందుకు? మంజూ! ఊ- మళ్ళీ నిలుచున్నావేం?

మంజు :- నిరుద్యోగీ! కాదు... మురళీధర్!

ముర :- ఆడదాన్ని రక్షించుకోలేని అధముడనై పోయాను మంజూ! మన ధర్మమే మనల రక్షించాలి.

సుంద :- "మురళీధర్" అనుకొంటూ ముందడుగు వెయ్యవేం? (చెయ్యిపట్టుక యీడ్చుకొనిపోవును.)

ముంజు :- మురళీధర్! మురళీధర్! (అంటూపోవును.)

సత్తా :- చోరాభాయీ! బడా జూఠాభాయీ హుంజావ్! చావల్ హిప్పించటానికి చలాకీ షేశావ్- హైరో షెబితే టలాయించావ్! కబర్దార్ షెబితే ఖరాబ్ షేశావ్- తమాషామన్షివి తయార్ హోయావ్ భాయ్! హాడాదానికి మొగ్గిహేషం హాత్కించీ హేశావ్—పేరూ మొత్తాం మొగాడికి పిరాహింపూ షేశావ్... హమారా తడాకా హారదం హాయిందా? హొట్టి దెబ్బకీ రెండూపిట్టల్ హూడీ పడ్డాయ్‌బాయ్! హూడీపడ్డాయ్! అచ్ఛా! మై జాతాహుం. (అని వెళ్లును.)

ముర :- (విచారముతో) మురళీ! నీ వెంత మూర్ఖుడవై పోయావురా! ఛీ! నేనూ వొక మనిషినంటూ నలుగురిలో మోమెత్తుకొని యెలా ముందుకొస్తావురా? లోకంతీరు కాదని నీవు చేసిన లోకోపకార మేమిటట? నిన్ను రక్షించడానికొచ్చిన మంజు—నిన్ను ప్రేమించిన మంజు, కష్టాలపాలవుతూంటే కళ్ళప్పగించి చూట్టమేనా? పగవాళ్లొచ్చి పట్టుకెళ్లుతూంటే "ఆడదానిని రక్షించుకోలేని అధమస్తుడ నైపోయాను మంజూ" అంటూ వెక్కిళ్ళుబెట్టి యేడ్వడమేనా? అంతే- అంతకంటే నీచేతనయింది అనుకొంటానికైనా లేదు— లేదు— సిగ్గూ లజ్జాభిమానాలు నీలో సింగారానికైనా లేవు— పరువు మర్యాదలు నీలో పట్టి చూద్దామన్నా

లేవు— మంచీ చెడ్డలు నీతో మచ్చుకయినా లేవు— ఛో! ఛో! పెళ్లాన్ని— నీ పెళ్లాన్ని కాపాడుకోలేని నీవు—లక్ష లాది ప్రజల కేం లాభం చూపిస్తావ్? అహ్హహ్హహ్హా— అహ్హహ్హహ్హా! పిచ్చి-పిచ్చి— పిచ్చిరా, మురళీ నీకు. నీ స్నేహితుడే అన్నాడుకదూ నీవు పిచ్చాడివని?

(రామయ్య, రంగనాధం, శేషాచలం, కోటంరాజు వచ్చెదరు.)

రామ :- నిరుద్యోగిగారూ! నిరుద్యోగిగారూ!

ముర :- (తెలివి వచ్చి) రామయ్యగారా? రండి-కూర్చోండి.

కోటం :- నిరుద్యోగిగారూ! నిష్కారణంగా బాధ పడుతు న్నారేం?

రంగ :- నిష్కారణ మేమిట్రా? నీ మొఖం— చేతిమీద నెత్తురు చిందించి కొడుతూంటె—

శేషా :- మరిచిపోయాను— మంజుగారేరి?

ముర :- నన్ను చంప నెంచినవారు నక్కియున్నారు కాబో లు— గుండెకుపెట్టిన గుళి కొంచెంగా చెదిరిపోయి చేతికి తగిలింది. మన విరోధులువచ్చి మంజను పట్టుకపోయారు.

రంగ :- వెంకటప్పయ్యగాడి కక్ష వెళ్ళకక్క తీరాడే—

రామ :- (రోషంతో) లేవండ్రా! లేవండి— మంజూదేవిగారిని వెదకటం మన కర్తవ్యం. కట్టగట్టుకపోయి వెంకటప్పయ్య కాళ్లూ చేతులు కట్టితెద్దాం.

కోటం :- ఎలక్షను రేపేగదా? ఈరోజే పనేమిటి?

రంగ :- గెలవలేనన్న గిలిపెట్టుకొని ముందుగా యీ పాపం ముడిగట్టాడు.

రామ :- పరమనీచుడు___ ప్రాణాలే కోరాడు.

ముర :- తొందరపడి ముందు నడపకండి. అంతేయూ మన మేలన్నమాట అబద్ధంకాదు. పాపంచేసినవాళ్లు పశ్చాత్తాపబడిందాకా శాంతించడమే సజ్జన లక్షణంనాయనా!

రామ : శాంతానికిది సమయంకాదండి. గాంధిగారి మంచితనమే గాంధీగారి అంతానికి మూలం. సమయానుకూలంగా సాహసం చూపకపోతే తానేకాక తనవారూ కష్టాలలోనుండి కడతేరలేరండీ!

రంగ :- వెంకటప్పయ్యను పాపమంటే, వేడినిళ్ళతో వ్రాళ్లు కాల్చుతూ?

కోటం :- ఈనాడు మన మూరుకుంటే యింకోనాడు పల్లెలన్నింటినీ పరశురామప్రీతి చేయిస్తాడు.

శేశా :- ఊరుకొంటం అంటే మనసు వొప్పుకొంటం లేదు.

రామ :- గాఢంగా తగిలిన నిరుద్యోగిగారి గాయం చూచారు కదా? లెండి. ఆలస్యమైతే అపకారం చేస్తుందేమొ? కట్టు కట్టించటం ముందుకావలసినది___ వెనుక కావలసినది వెంకటప్పయ్య వేడిరక్తం కళ్ళచూట్టం.

(అందరూ మురళీధరుని మోసుకొని పోదురు)

[వెంటనే తెరలేచును. వెంకటప్పయ్యగారిల్లు- వెంకటప్ప

య్య కంగారుగా వుండును. రామయ్య, రంగనాథం, శేషాచలం, కోటంరాజు ముందు నిలుచుంటారు.]

వెంక :- ఏమిటీ గందరగోళం? ఎందుకొచ్చారు మీరంతా?

రామ :- ఈవేళ నీ నెత్తురుచూడకుండా యింటికి పోము. రా! ముందురా!

వెంక :- ఏమిటీ యీాయాగడం? ఇంత పొగరా మీకు? మించి వచ్చారా మిమ్మల్ని చంపేస్తాను. ప్రభుత్వాధికారం నాకుంది—పట్టి మిమ్మల్ని బాధిస్తాను. నల్లుల్ని మాడ్చినట్లు మాడ్చి నాశనం చేస్తాను.

రామ :- ప్రభుత్వం—ప్రభుత్వమంటె పుణ్య కార్యాలకు పుట్టినిల్లు—న్యాయబుద్ధికి నడిగడ్డ—ప్రభుత్వం ప్రజలను రక్షించేదికాని భక్షించేదికాదు. అదృష్టం వచ్చిన అధికారం—పాలనా సభ్యులలోదొరికినపదవి గౌరవం నిలుపుకొన్న నీతి మూర్తులకు—పాటించిన పరమ దయామయులను, ప్రణుతి చేస్తాం—ప్రాణాలనిస్తాం. కాని- నీలాంటి కఠినాత్ముని కత్తితో చీలుస్తాం—కండలుకోసి కాకులకు వేస్తాం.

రంగ :- కట్టి తన్నకుండా కబురు లెందుకురా?

శేషా :- తన్ను వెంబడి ఏడి తలతిరిగి పోవలరా!

కోటం :- నిరుద్యోగిని చంపటానికి పంపించిన నిన్ను వెళ్ళకరావాలరా!

వెంక :- నిరుద్యోగిని చంపటానికి నేను పంపించానా? ఎంత

మాట-ఎంతమాట— ఇంటిబిడ్డలా మా యింట్లో యెన్నా
ళ్లో వున్నాడు— మాట భేదంవచ్చింది మానుకొన్నా
డు— పోలింగు వచ్చింది పోటీ చేశాడు. అంతేగా—
అందులో తప్పేముంది? నాటి పెద్దమనిషిని సాధించాలని
కూని చేయించటానికి కుట్ర చేస్తానా?

రామ :- మాయ మాటలతో మాకింక మసిపూయలేవు—
తెరచాటు నాటక మెన్నాళ్లు తెలియకుండా ఆడుతావ్?
కొంపకొంపకూ తిరిగి— కొండంతాశలు పెట్టి— "పల్లె
పల్లెలను పరామర్శిస్తాన" ని మోసగించిన మొండివి నీను
గవుగడూ నీవు?

వెంక:- ఏమోయ్, రామన్నా! ఏమిచూచుకొని యీగర్వం?
వాళ్ల మెంటాలో మాటాడటమంటె పప్పు బెల్లాలను కొ
న్నావా? యుద్ధాలు రాకుండా; ఉపద్రవాలు లేకుండా
తప్పించేదానికి మాశలలు వాస్తున్నాయి. పది వోట్లొచ్చా
మని పరువు లేకుండా మాటాడుతారా? అసేగేనాటి
కేమైనా అగ్గుంటుందా? ఇకమీదట యింట్లో పిల్లాడే
డ్పినా— పెళ్లాం మాటినకపోయినా పెద్ద నేరంగా పచ్చి
మినిస్టర్గా రింటిముందు వోటింగు పెట్టడమేనాపని? ఛా!

రామ :- ఇంతట నయినా వూరుకోక యింకా సమర్థిస్తా వెం
దుకు? మినిస్టరుగా నీ వొక్కడవె మిణుకు తున్నావా?
ప్రభుత్వంతో సంప్రదించి ప్రజోపకారంచేసే మహానీయు
లను చూచైనా మనసు మార్చుకోరాదూ? నీచుడివి నీ
వొక్కడివి చేరి మంచివాళ్ళ మాట పోగొట్టుతున్నావే?—

**రంగ** :- దొంగ సన్యాసిని దార్లించక చూస్తారేమిట్రా?

**కోటం** :- నిరుద్యోగి పొట్టన పెట్టుకొని నీళ్లు మింగేవాడే. కాస్త దేవుడు కనిపెట్టకపోతే నిరుద్యోగి మనకు నిజంగా దక్కేవాడే కాదు.

**శేషా** :- మిత్రుడ్ని పెట్టుకొని మిటకరించి చూస్తావేం? (ముందుకు పోవును.)

**వెంక** :- అడుగు ముందు వేశారా చెడిపోతారు.

**రామ** :- చెడిపోయేది ఇదివరకే చెడిపోయాం. మమ్మల్ని చీల్చించండి — మమ్మల్ని చంపించండి — నిన్నా కొట్టకుండా పోవటం సికలలోని సంగతి. నిరుద్యోగిని నిర్మూలంచేస్తే పోదున నీకు పోటీ యుండదనా? నిన్నే చంపి నిరుద్యోగినే గెలిపిస్తాం. సాయిబుగారికో సమాధాన పడక — కోటా బియ్యమంతా కొలతలో పెట్టించి — పల్లెలో వారి ప్రాణాల రక్షించిన మా మహారాజుకై మా నలుగురం చచ్చిపోయినా చాలనుకొన్నాం.

**రంగ** :- కొట్టేపని, కోసేపని మనం చేయటం మంచిదికాదు. నిరుద్యోగిని చంపాలని నీవు నిర్ణయించుకొన్నావు కదూ? నిరుద్యోగిచేతనే పిస్ని నిలువబెట్టి కొట్టిద్దాం. త్వల్లూ, చేతులు కట్టి కదలకుండా తీసుకరండి.

**వెంక** :- నిదానించి చూస్తుంటె నెత్తికెక్కుతున్నారా? ఫోన్ చేసి పోలీసుల రప్పిస్తాను. (ఫోను దగ్గరకు పోవుచుండ అందరూ వెంబడింతురు) (తెర)

# నిరుద్యోగి

## ( పదో రంగం )

[నిరుద్యోగి యింటిముందు వెంకటప్పయ్యను చేతులు గట్టి నిలవబెడతారు. రామయ్య. రంగనాథం, శేషాచలం, కోటంరాజు నిలుచుంటారు. తెరలేచును.]

వెంక :- (దీనముగా) నాయనలారా! నా మాటవిని పదిమందిలో నా పరువు పోకముందె మరియాదగా విడిచిపెట్టి మాట దక్కించండిరా! బాగా బ్రతికినవాడిని బ్రతిమిలాడు కొంటున్నాను. ఈ సమయం తప్పితే మిమ్మల్ని యేమైనా చేయించగలనని నాకూ తెలుసు— మీకూ తెలుసు. అన్నిటికి మీరు సిద్ధమయ్యారు. ఆత్మ గౌరవానికి నేను పాటుబడుతున్నాను. ఇన్నాళ్ళనుండి నేనుచేసింది ద్రోహమని యిప్పుడు తెలుసుకొన్నాను. బానెడు పానకంలో బెడ్డెత్తునాభి పడినట్లు నావక్రని ఘోరాలతో నా ఆంధ్ర పరిపాలనా విధానానికి మాసిపోనట్టి మచ్చ కలిగించాను. ఓటింగు విలువకు వుద్వాసం చెప్పించాను— పాపానికి తగ్గ పరితాపం పొందుతున్నాను. నలువురికంట బడక ముందె నన్నొదిలి పెట్టండి. చెప్పిన పనులన్నీ చేసి పెడతాను. అడిగినంతడబ్బు అణాలతో యిస్తాను. సగంచచ్చిన నా బ్రతుకు సాటివారిలో వేయకండిరా!

మురళీధరుడు :- (కట్టుకట్టిన చేతితో వచ్చి) ఏమిటీ సాహసం! ఎందుకిలా చేశారు?

రామ :- నేనేనండీ నిరుద్యోగిగారూ! మీ కపకారం చేసిన వీడ్ని మే మెలా సహిస్తాము? (వెంకటప్పయ్య జేబులో పిస్తోలు లాగి) పిస్తోలు యిదిగో- పేల్చి చంపెయ్యండి- అదేదో ఆనిక చూద్దాం.

మురః- (పిస్తోలుతీసుకొని) నామాటప్రకారం నడుస్తారా?

రామ :- ముమ్మాటికి—

ముర :- అయితే, అవశ్యం వీరిని విడవండి.

రామ :- (తెల్లబోయి) వీడిని విడిచిపెట్టడం. విపరీతకార్యం- విప్లవ కారణం.

ముర :- అవును వెంకటప్పయ్యగారిది విప్లవకారణమే-నిజమే నని నేనూ తప్పొప్పుకొని తలవాలుస్తాను. అయితే వివేక వంతులై మీరుచేసిన విశేష మేమిటంటారు? శాంతంతో ఎదైనా సాధించగలంకాని— పౌరుషంతో యేపనయినా చేయగలమా? వారి నేరాలకు వారే బాధ్యులు— సరి పడనిదాంట్లో సమభాగం నాకెందుకు? మహాత్ముని మా టలు మీరు మరిచిపోతే— నాకోరికను మీరు నసింప చేయాలనుకుంటె— వీరిని మీరు విడిచిపెట్టకుంటే, యీ పిస్తోలు పేల్చుకొని— యీ సమయమందు నేనే చావ టానికి నిర్ణయించు కొన్నాను. (గురిపెట్టుకొనును.)

రామ :- (మురళీధర్ చేయిపట్టుకొని ఆపి) మహాపరాధిని— మన్నించండి. (వెంకటప్పయ్యగారి కట్లువిప్పి) దూరదృష్టి లేని దోహబుద్ధులం— మమ్ములను మన్నించాలి.

వెంక :- అందరినీ మన్నించగల అధికారం గలాడు నిరుద్యోగేనని నే నంగీకరిస్తున్నాను. (మురళీని కౌగలించుకొని) నిరుద్యోగీ! నీతిపరులలో మొదటివాడవనటం ముఖస్తుతి కాదోయ్! అయ్యలారా? నేటినుండి నాకీ నిరుద్యోగి మిత్రుడు— బాంధవుడు— తెల్లవారితే యెలక్షనని తెలియనివాళ్లు లేరు. ఆపనిమీదనే అందరం తిరుగుతున్నాం. కాని యిప్పుడు కలిగిన మార్పొకటి. విత్ డ్రా చేసుకొని నేను పోటీ విరమించుకొంటూను. నిరుద్యోగికే ఓటు నేనూ చేస్తున్నాను. మంత్రికి కావలసిన మహోత్కృష్టత నిరుద్యోగియందే నిలిచుంది.

ముర :- చెప్పవలసొచ్చింది—చిత్తగించాలి. పెద్దలుమీరు— పిన్నను నేను. మీరు శ్లాఘించటం మాకు మేలుకాదు. ఆనాడు తమ యింటివద్ద ఆవేశపడి యేమేమో అనేశాను. తండ్రిలాంటివారు తప్పు సైరించాలి.

వెంక :- ప్రమాద మెంతటివారికైనా పరిపాటిగా జరుగుతూంది. నీ నిర్మలతత్వమే యుత్తమునిగా చేసింది. మనసు బాధపెట్టుకొని మదనచెందబోకు. నీవు మెంబరుకావటమే కోరుతున్నాను.

రామ :- వింతగా మాటాడుతున్నారేమండీ వెంకటప్పయ్యగారూ! పోటీరాకుండా, పోలింగులేకుండా నిరుద్యోగిగారిందులో నిగ్గుతారంటూరా?

వెంక :- నేనే యీ పనికి నిశ్చయంగా తగనివాడనని తప్పుకొంటున్నాను. నాయనా, నిరుద్యోగీ! మంత్రిపదవితో

బాటు మంజునుకూడా స్వీకరించి— యిల్లరికపు టల్లుడవై యిల్లెటముండవోయ్!

ముర :— ఇల్లెటం మాటలు యిపుడెందుకులెండి?

సుంద :— (వచ్చి) అందర్నీ, అరెస్టు చేస్తున్నాను.

వెంక :— సుందరం! నిరుద్యోగి నేటినుండి నీకు తమ్ముడోయ్!

సుంద :— మామగారా! పూర్తిగా మారిపోయారేం?

వెంక :— అవును నాయనా! అంతామారిపోయింది. నిరుద్యోగిలోగొప్ప నేనిపుడు తెలుసుకొన్నాను. మంజు నిరుద్యోగిని మనసారా ప్రేమించింది. మంజుమీద నిరుద్యోగికి మమకారముంది. అలాంటివారికి అడ్డుచెప్పకుండా మంజును నిరుద్యోగి కివ్వడమే మనందరికీ మంచిది. పెద్దమ్మాయిని నీవు పెళ్ళి చేసుకో.

సుంద :— మేనమామగారి మాట మీరిపోతానా? నిరుద్యోగీ! కాదు— మురళీధర్! చెరుపుతలంచి చెలిమి మరిచాను— తులువతనాన తొందరపడ్డాను—నీకు మహోపకారంచేసిన నేరస్తుణ్ణికూడా అయాను. మధ్యజరిగినవాటి మరిచిపొమ్మంటూ నీదారికొచ్చి నిన్నర్థిస్తున్నాను. ఆనాడు నీకు ఫహాపాతకుడనే కాకుండా యీనాడు షడ్డకుడను కూడా అవుతున్నారా మురళీ!

ముర :— (కౌగలించుకొని) సుందర్! నాస్నేహితుడు కుమార్తుడుకాకపోతే నాకుమాత్రం క్షేమకరమటరా!

వెంక :— (సంతోషముతో) ఏమిటీ? మురళీధరా? మా కెవరికీ

తెలియకుండా మరుగున బెట్టారేం?

రామ :- ముద్దులు గురిపే ముచ్చటైన పేరండీ! మంజూ, మురళీధర్. మరీ బాగున్నాయి.

వెంక :- ఐతే అసలీ తెరచాటునాటక మేమిటో తెలియచెప్పు.

సుంద :- విషయమంతా తర్వాత విశదంచేస్తాను. ముఖ్యమైన పనేమిటో ముందు సెలవివ్వండి.

వెంక :- ప్రొద్దున పోలింగులో నేను విత్ డ్రా చేసుకొంటం— నిరుద్యోగి...కాదు కాదు...మురళీధర్ విజయలక్ష్మితో బాటు మంజును వివాహమాడటం. రెండు పెళ్ళిళ్ళు రేపే జరగాలి.

సుంద :- రావలసిన చుట్టాలంతా రావద్దా మామా?

వెంక :- విజయకాలంలో వెనుకాడరాదు. పదహారురోజుల పండుగనాటికి మనవాళ్ళను పిలిపించి మర్యాదలుచేద్దాం.

హరిబాబు :- (వచ్చి) అయ్యా! మంత్రి వెంకటప్పయ్యగారింటికి మార్గమెటు?

రామ :- వారిక్కడే వున్నారు. మీరెవరో యిలారండీ.

హరి :- (జనములోనుండి వచ్చి) వెంకటప్పయ్య గారంటే వీరిలో నెవరండీ?

వెంక :- నేనే— మీరు?

హరి :- వూరు మదరాసు— పేరు హరిబాబు.

ముర :- అన్నయ్యా!

హరి :- తమ్ముడూ! (యిరువురూ కౌగలించుకొందురు.)

వెంక :- (ఇరువురిబుజములపై చేతులువైచి) మురళీధర్ మీ కేమయినా ముఖ్యమయినవాడా ?

ముర :- మరెవరోకాదు——మా అన్నయ్యగారె

హరి :- మురళీ! ఇంటికిరాకుండా యిక్కడేమిచేస్తున్నావురా?

సుంద :- మరదలుని సంపాదించే మహత్కర కార్యంలో తమ్ముడుమనల్ని తలచుకొంటాడా హరీ ?

హరి :- (సుందరాన్నిచూచి) ఓ——నీవాసుందరం ! సహపాఠకులమంతా సమావేశ మయ్యామన్నమాట ?

సుంద :- సహపాఠకులం సమావేశ మవటం కాదు—సంబంధం చేసుకోబోతున్నాం.

వెంక :- అన్నంతిన్నాక ఆమూలాగ్రంగా మాటాడవచ్చు, మనింటికి పోదాం రండి.

(అందరూ వెళ్తారు తెర లేస్తుంది)

[వెంకటప్పయ్యగారిల్లు: జనార్ధనరావు, నారాయణరావు, వెంకటప్పయ్య కూర్చొని ఉంటారు. రత్తం, ముంతాలు, చెరో వయిపున నిలుచొని వుంటారు]

వెంక :- రాత్రి మీకు టెలిగ్రాం అందిందా !

జనా :- రాత్రి టెలిగ్రాం అందింది—— రైలూ అందింది.

నారా :- అందబట్టి లగ్నానికి అందుకో కలిగాం.

రత్తం :- చిత్తంబాబూ ! అర్జెంటు టెలిగ్రామంటే ముందు అదిరి పోయాం. విప్పి చదువుకొంటె యేముందీ ? వివాహ వార్తలు -విందువార్తలు, ఆహ్వానాలు——అభివందనాలు,

వియ్యంకుల ముచ్చట్లు—వేడుక ప్రయత్నాలు. ఆ—
ముద్దులో ముద్దు— సందడిలో సందడి—సరళా హరిబా
బుల పెళ్ళికూడా......సరదాపడి......

వెంక :- సందేహించక యిక్కడే సరిపెట్టేదాం.

కుంతా :- అంతేలెండి. మూడు పెళ్ళిళ్లూ ముడిపెట్టొచ్చుగా?

జనా :- బావగారూ! మూడుముళ్లూ పడగానే కొడుకునూ, కోడలును మాయింటికి పంపించండి. జరుగవలసిన వేడుకలు జరిగిపోయాక మీ యిష్టప్రకారం అల్లుణ్ణి మీ యింట్లోనే వుంచుకొందురుగాని—

వెంక :- అదె, మాకూ పదివేలు.

రామ :- (వచ్చి) వెంకటప్పయ్యగారూ! వేగిరం కానివ్వండి. వూరేగింపుకై జనులు వుత్సాహ పడుచున్నారు.

వెంక :- అయింది—ఆలస్యమేమీ లేదు. అదుగో

[వెనుక తెర లేవగా మంజూ మురళీధర్-లలితా సుంద
రంలు-సరళా హరిబాబులు పూలమాలలు వేసుకొని
దంపతులుగా నిలుచుందురు.]

రామ :- లేవండి—వూరేగింపుకు లేవండి. (లోపలివారితో కలసి) డాక్టరు మురళీధర్ గారికి జై— మంజూదేవి గారికి జై— వెంకటప్పయ్యగారికి జై—



జై-జై-జై భారతమాతా।
జై-జై-జై [illegible] సమేతా ॥జై॥

తెర .... .... ....

సమాప్తి.